# సాటిలేని టీపొడి
# బ్రూక్ బాండ్
# 3 రోజెస్

విశిష్టమైన నాణ్యత.
సరియైన వెలకి. చిక్కటి
మంచి డికాక్షన్
యిస్తుంది. మరియు
హెచ్చు కప్పుల టీ.
3 రోజెస్. యిదివరలో
మీరెప్పుడూ యిలాంటిది
రుచి చూసి ఉండరు.




నాణ్యతలో అగ్రత
సరియైన వెల

BB 9919

# చిన్న డిపాజిట్టు



# ఇచ్చే గొప్ప ప్రతిఫలం

మీ నిత్యావసరాలు కూడా గడవటం కష్టంగా ఉన్నా ఇదిగో మీకు తోడ్పడే పథకం—నిత్యనిధి. ఏ మాత్రం ఇబ్బంది లేకుండా తేలికగా పొదుపు చేయవచ్చు. 25 పైసలవంటి చిల్లరను ప్రతిరోజూ మీ ఇంటికే వచ్చి ఐదేళ్ళపాటు సేకరిస్తారు. చివరికి వడ్డీతో సహా పెరిగిన మొత్తం మీకు ఆశ్చర్యం కలిగిస్తుంది. రోజు వారీ సంపాదనగల డాక్టర్లకు, లాయర్లకు, హోటల్ యజమానులకు, దుకాణాల యజమానులకు, వ్యాపారస్థులకు నిత్యనిధి అత్యంతానుకూలమైన పొదుపు పథకం. పొదుపు చేయడానికి ఇదొక్కటే పథకం కాదు. కెనరా బ్యాంకులో పెక్కు పొదుపు పథకాలు ఉన్నాయి. మీకు ఏదో ఒకటి నచ్చితీరుతుంది. ఇందుకై దగ్గరలో ఉన్న కెనరా బ్యాంకును సందర్శించండి. ప్రస్తుతంలోనూ, భవిష్యత్తులోనూ మీ అవసరాలకు అనువైన పథకాన్ని ఎన్నుకోవడంలో మా మేనేజర్ మీకు తోడ్పడగలరు. కాలక్షేమ, కామధేను నిరంతర, ఫిక్స్‌డ్, రికరింగ్ మరియు సేవింగ్ డిపాజిట్ ఖాతాలనుండి ఎంచుకోం!




**కెనరా బ్యాంక్**
(భారత ప్రభుత్వ
సంపూర్ణ స్వామ్యంలోనిది)
తక్కువేమీ కాదు
ఏ డిపాజిట్ అయినా

maa CB5 Tel b-79

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకులు :
[1938 1972]
శుక్రవారం : 13-4-'79
సిద్ధార్థినామ సం. చైత్ర బ. విద్యమి
సంపుటము 72 : సంచిక 31
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
*
పోస్టులో ఏడాది చందా రు. 41-60
ఆరు మాసాల చందా రు. 20-80
విడి ప్రతి వెల 75 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ–520 003


## విషయానుక్రమణిక

# డాక్టరు సలహాలు

యస్. ఆర్. ఆర్. నెల్లూరు

నా వయస్సు 29 సంవత్సరములు. వివాహమై 6 సంవత్సరములు అయినది. కాని పిల్లలు కలుగలేదు.

వివాహమై 3 సంవత్సరములు దాటితే దంపతులిద్దరూ పరీక్ష చేయించుకోవటం అవసరమే! అనవసరంగా స్త్రీలను మాత్రం పరీక్షలకు లోను చేయటం, పురుషులు నిలయినంతవరకూ పరీక్ష చేయించుకోటానికి తప్పించుకోవటం మన సమాజంలో వున్న సనాతనాచారం! పిల్లలు కలుగకపోతే స్త్రీ మాత్రమే కారణమని అనుకొని ఆమెను హేళనకు గురిచేయటం అన్యాయం.

మీరిద్దరూ వైద్యుల వద్ద క్రమంగా వారు చెప్పిన విధంగా పరీక్ష చేయించుకుంటే పిల్లలు కలిగే అవకాశం వున్నది.

ఎమ్. కె. డి. పిఠాపురం

నా వయస్సు 48 సంవత్సరములు. నేను ఒక ప్రభుత్వ హాస్పటల్‌లో 'డ్యువోడినల్ అల్సర్' కు ఆపరేషన్ చేయించుకున్నాను. ఆపరేషన్ అయిన తర్వాత 5 నెలలు బాగానే వున్నది. తర్వాత డోకులు అవుతున్నది. డోకువెళ్ళిన తర్వాత కొంచెము సులువుగా వుంటున్నది— కాని ఇదివరకు వున్న లక్షణాలలో మార్పులేదు.

పెప్టిక్ అల్సర్ అనే 'కడుపులో పుండు' వున్న వారికి శస్త్ర చికిత్స చేసిన తర్వాత తిరిగి యథాప్రకారం రోగలక్షణాలు ఏర్పడటం పలువురిలో జరుగుతున్నది. ఇది ఎవరి లోపముకాదు. కడుపు అనే 'స్టమక్' లో ఎక్కువ ఆమ్లం ఉత్పత్తి అవటం వల్ల ఆపరేషన్ చేసిన ప్రక్క భాగంలో తిరిగి పుండు ఏర్పడటం మాత్రమే మీరు వ్రాసిన పై లక్షణాలకి కారణం. కారం, పులుపు ఆహారంలో మానటం, ఆహారం నియమబద్ధంగా తీసుకోవటం, 'ఆర్బిట్స్' మాత్రలు రోజుకి 6 (2 వంతున మూడుపూటలు) మమిలిమింగాలి. ఈ మాత్రలు ఆహారానికి 20 నిముషాల ముందుగా మమిలిమింగాలి.

వై. జె. చిత్తూరు

మా పాపకు రెండుమార్లు విరోచనాలు వచ్చినవి. ఆ రెండుమార్లు గ్లూకోజు ఇంజక్షన్లు ఇచ్చినారు. రెండవసారి యిచ్చినా ఫలితం లేకపోయింది. పాప చనిపోయే సమయానికి 14 నెలలు. మాది మేనరికము. ఇలా జరగకుండా వుండుటకు గర్భముగా వున్నప్పుడు ఏ మందులు వాడవలయునో తెల్పండి.

మేనరికానికి, గర్భసమయంలో తీసుకోతగిన ముందుజాగ్రత్తలకి విరోచనాలవటం వల్ల పాప మరణించటానికి ఏ విధమైన సంబంధములేదు. గ్లూకోజు, సలైన్ యివ్వటం అనేది మాత్రమే ఎంచదగిన విషయంకాదు. విరోచనాలవటం ప్రారంభమయిన వెనుక యెంతకాల వ్యవధిలో యిచ్చినది, విరోచనాలు ఎన్నిరోజులు అయినది, విరోచనాలయ్యే ముందు శిశువు ఆరోగ్య స్థితి, యీ గ్లూకోజుతో పాటుగా ఇవ్వబడిన మందులు అనేవాటిపై విరోచనాలు తగ్గటం అనేది ఆధారపడి వుంటుంది. సంబంధం లేని వాటికి ముడిపెట్టి తాము బాధపడి, ఇతరులను బాధపెట్టటం తప్ప మరేమీ సాధించలేరు.

వి. హెచ్. ఆర్. చీరాల

నేను గత 10సం.లుగా ఆస్తమాతో బాధపడుతున్నాను. మీరు 5—12—78 వారపత్రికలో 'అలర్జిక్ క్లినిక్స్' వున్నవని, వాటిలో పరీక్షించుకొని మందులు వాడమని చెప్పియున్నారు. నాయందు దయవుంచి 'అలర్జిక్ క్లినిక్స్' మన ప్రాంతములో ఎక్కడెక్కడ వున్నవి, వాటి అడ్రసులు వాటి వివరములు తెలుపప్రార్థన.

అలర్జీ క్లినిక్‌లు పెద్ద పట్టణాలలో గల మెడికల్ కాలేజి — ఆస్పత్రులలో ఉంటాయి. హైదరాబాదు, గుంటూరు, విశాఖపట్నం, తిరుపతి మొదలయిన కేంద్రాలలోని మెడికల్ విభాగాలలో పై క్లినిక్‌లు పనిచేస్తాయి. మద్రాసులో స్టాన్లీ హాస్పిటల్, జనరల్ హాస్పిటల్ మొదలయిన వాటిలోను, కొన్ని ప్రైవేటు చికిత్సా కేంద్రాలలోను పై క్లినిక్‌లు పనిచేస్తున్నాయి.

సి. హెచ్. జి. యలమంచిలి

మా పాపకు ఇప్పుడు 8వ నెల. 6వ నెలనుండి విరోచనములు అవుతున్నవి. డాక్టరు కొన్ని మందులు వ్రాసిఇచ్చినారు. అవి వాడినా తగ్గలేదు. తల్లి పాలే ఆహారము. పళ్ళుగాడా, వచ్చే సూచనలు కన్పించలేదు. ఎందువలన ఇలా విరోచనాలు అవుతాయి?

మీ పాప బరువునిబట్టి ఆహారాన్ని ఇవ్వవలసి ఉంటుంది. మలపరీక్ష చేయించి వైద్యులకి చూపించండి. ఈలోగా "బనలోనా" అనే మందుని కొని, రోజుకి మూడుపూట్లు 1 స్పూన్ పౌడర్‌ని ఒక గ్లాసు నీళ్ళలో వేసి బాగా ఉడకబెట్టి ఇవ్వండి. రోజుకి రెండుమాత్రల వంతున లోమోటిల్ మాత్రలను నాల్గు రోజులు మాత్రం వైద్య పర్యవేక్షణలో వాడవలసి ఉంటుంది.

యస్. య్యస్. పి. - హైదరాబాద్

నాకు కుడిచెవి మీద ఎర్రగా కందినట్లుగా కాయకాచినది. ఇది నాలుగు నెలలనుండి వున్నది. మందులు వాడినా ప్రయోజనము కన్పించలేదు. చూచుటకు చాల అసహ్యముగా వున్నది. దీనికి ఏమి చెయ్యాలి?

చెవిమీద చర్మంలో ఎర్రగా కాయలాగాలేవటం అనేది నాలుగు నెలలుగా మాత్రమే వుంటే అది రక్తనాళాల సముదాయమైనా గాని (హెమాంజియోమా) లేక సెబేషియస్‌సిస్ట్ గాని అయి వుంటుంది. అంటే స్వేద నాళంలో అడ్డు ఏర్పడటం వల్ల స్వేదం పేరుకుపోయి, దానిలోని నీరు యెండిపోవటం వల్ల మిగిలిన లవణాల కూడిక చూడటానికి అసహ్యంగా వుంటే దీనిని శస్త్ర చికిత్స ద్వారా తీసివేయటం తప్ప వేరే మార్గంలేదు.

కె. జి. ఎమ్. - ఖమ్మం

నత్తి వున్నవారికి బెంగుళూరులో చికిత్స గలదని వ్రాశారు. ఆ డాక్టర్ అడ్రస్ తెలుపగోరెదను

ఈ చికిత్స ప్రత్యేకంగా వ్యక్తిగతంగా ఒకరు మాత్రమే నిర్వహించటంలేదు "ఆల్ ఇండియా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ స్పీచ్" అని మైసూరులో ఒక సంస్థ వున్నది. మైసూరు వెళ్ళి అడిగితే ఎవరైనా చెప్పగలరు. అక్కడ ప్రత్యేకంగా నత్తిగల వారికి మెరుగుపడే అవకాశాలు సాధనాలు వున్నాయి.

—డా॥ కె. వెంకటేశ్వరరావు



— లోకంపోకడ * జోమెక్ —

రెండేళ్ల జనతా పరిపాలనలో మీ ప్రజాస్వామ్య హక్కుల్ని పునరుద్ధరించాను.

ప్రజాస్వామ్యం సంగతలా వుంచండి. వాస్తవానికి మీరు చేసిందేమిటి?......

కుమారా, జనతా లోని బి.ఎల్.డి., ఆర్.ఎస్.ఎస్ ల మధ్య వర్గపోరాటం పెరుగుతుందనే మన ఆశ! ......

అన్నీ ఫిర్యాదులే! అందుకే ఆర్థిక శాఖ కన్నా దేశీయాంగ శాఖే మంచిదన్నాను!

ఫిర్యాదులు

కామ్రేడ్, రండి! ఇలా కూర్చోండి! శాంతి గురించి చర్చిద్దాం!

చైనా ఆక్రమణ

మీరాక్రాసిన నాకోలు ఇంకా కరుస్తూనే వుంది! మీకు కనిపించటం లేదా!...... ...




## ముఖచిత్రం

23 3–79 కమలహాసన్, జయప్రద ముఖ చిత్రం ఏమంత బాగోలేదు.

యల్. ప్రఫుల్లచంద్ర, ఇతరులు (ధర్మవరం)

* * *

"అందమైన అనుభవం" కమల్‌హాసన్, జయప్రద (23-3–79) గార్లతో వెలువడిన సంచిక అన్ని తరగతు వారిని ఆకర్షించింది.

ఆర్. రఘుభీర్‌సింగ్, ఆర్. సుగుణబాయి (ఏ నారు)

* * *

'గోరి' గారి కుంచెనుండి తయారైన 'సుంద రాంగి' కొత్త సంవత్సరానికి స్వాగతం పలుకుతున్నట్లు ప్రచురించిన ముఖచిత్రంతో వెలువడిన 'ఉగాదిసంచిక' (30 3 -79) మా కన్నుల పండుగగా ఉన్నది.

జి. యస్. వి. సత్యనారాయణ, జి. వెంక టేశ్వరరావు, శేఖరు. (యలమంచిలి).

## సీరియల్

సీరియల్ "కోటిగాడు" వాస్తవానికి దగ్గరగా ఉంటూ భావయుక్తము గా ఉన్నది. "జీవిత మాధుర్యం" సీరియల్ సవ్యంగా సాగుతూ, ఉత్తేజకరంగా ఉంటున్నది.

అన్నెపు కైలాసరావు, (కనిమెట్ట).

* * *

శ్రీమతి రామలక్ష్మి రాసిన "కోటిగాడు" సీరియల్ చాలా బాగున్నది. ఇందిర నిర్ణయము మార్చుకుంటున్నదా! ఇందిర కోటికి వివాహం జరుగుతుందా? ఏమవుతుందో !

పట్టిమట్ట ఆదిపట్టాభిరామన్న, (వెలువలపల్లి.)

## కథలు

"పిరికివాడు" కథ వస్తువుబాగుంది. కాని పిరికివాడెవరో అర్థంకాలేదు. ఏం చెయ్యక ప్రక్కనున్న వాడు పిరికివాడా? ఉడతాభక్తిగా తనకు చేతనైంది చేసినవాడు పిరికివాడా? ఇక్కడ రాజారావు పిరికివాడా? కిరీటిరావు పిరికివాడా?

కె. ప్రమోద్‌కుమార్, (నిజామాబాద్)

## శీర్షిక

"మన తొలిపండుగ" శీర్షికలో శ్రీ అంగీరస గారు ఉగాది విషయాలు మాకు తెలియనివి క్లుప్తముగా తెలియజేశారు.

నేమాని వెంకటేశ్వర్లమ్మ, (విశాఖపట్నం)

# వంటలు

## ఉల్లిరంగా బాత్

పులావు బియ్యం అరకిలో, ఉల్లి 4, వెల్లుల్లి 1, పచ్చిమిర్చి 10, అల్లం, గసగసాలు టీస్పూను, ధనియాలు టీస్పూను, జీలకర్ర టీస్పూను, బటాణీలు 100 గ్రా, కరివేపాకు, కొత్తిమిరి, పసుపు, బంగాళాదుంపలు పెద్దవి 4, నిమ్మపండ్లు 2, వేరుశనగపప్పు 100 గ్రా, ఎండుకొబ్బరి, ఉప్పు, దాల్చిని, లవంగాలు 4, ఏలకులు 4, నువ్వుల నూనె పావుకిలో.

తయారుచేయు విధము :- బియ్యం కడిగి పసుపు వేసి పులిహోర అన్నంవలె వార్చుకోవాలి. బటాణీలు ముందురోజు నానవేసి వుంచుకోవాలి. బంగాళాదుంపలు వుడికించి పైపొర తీసి వుంచుకోవాలి. ఉల్లిగడ్డలు చిన్న చిన్న ముక్కలుగా తరిగి వుంచుకోవాలి. పైన చెప్పిన మసాలా సామానులన్నీ మెత్తగా రుబ్బి, బటాణీలు ఒక గిన్నెలో మెత్తగా వుడికించాలి. బాణలిలోగాని గిన్నెలోగాని శనగపప్పు, మినపపప్పు, ఆవాలు ఎండుమిర్చి పోపు వేయించి ఉల్లిచెక్కు, ఉప్పుగుండ, కరివేపాకు, కొత్తిమిరివేసి, ఉడికిన బంగాళాదుంపలు మిశ్రమంచేసి, అందులో వెయ్యాలి. బాగా కలియబెట్టి మసాలాముద్ద నూనెలో వేయించి పిమ్మట ఆ మిశ్రమం గోరువెచ్చని అన్నంలో వేసి కలపాలి. నిమ్మపండు రసంపిండి నూనెవేసి కలియబెట్టి రెండుగంటలు మూతబెట్టి వుంచాలి. ఈ వుల్లి రంగాబాత్ చాల రుచిగా వుంటుంది. ఇది వేసవిలో లంచి టైములో టిఫిన్‌క్రింద తినవచ్చును. కావాలసినవారు వేరుశనగపప్పు, ఎండుకొబ్బరి కలుపుకోవచ్చును.

– శ్రీమతి రమణా ప్రకాష్

## కవితలు

కమలహాసన్, జయప్రద ముఖచిత్రంతో వెలువడిన సంచికలో శ్రీ బొర్రా పాండురంగ శాస్త్రిగారు రచించిన "కూటి—విద్యలు" గేయం బాగుంది.

టి. కరుణాకరశర్మ, బి. గణేశ్, టి. దివాకరశర్మ, (వేల్పూరు)

# ఆంధ్రసచిత్రవారపత్రిక

## ఫోటోగ్రఫీ పోటీ!

## మొత్తం రూ. 1000 లు బహుమతులు!

ఫోటోగ్రాఫర్లను ప్రోత్సహించే నిమిత్తం ఛాయచిత్రాల [తెలుపు – నలుపు] పోటీ నిర్వహించాలని నిర్ణయించాము.

**ఉత్తమ బహుమతి రు. 250 లు**
**ద్వితీయ బహుమతి రు. 200 లు**
**తృతీయ బహుమతి రు. 150 లు**

**ఇవిగాక మరి నాలుగు సాధారణ బహుమతులు ఒక్కొటి రూ. 100 ల వంతున వుంటాయి.**

ఫోటోలు అందవలసిన ఆఖరుతేదీ **31 మే 1979**

★ నలుపు–తెలుపు ఫోటోలు మాత్రమే పంపాలి. నెగిటివ్‌లు, కలర్ ట్రాన్స్‌పరెన్సీలు పంపకూడదు.

★ సైజు క్యాబినెట్ సైజుకు తగ్గకుండా, పుల్ సైజుకు మించకుండా వుండాలి.

★ ఫోటోలోని 'వస్తువు' ఏదైనాసరే, ప్రకృతిసిద్ధం లేదా సామాజికం అవాలే తప్ప చలనచిత్ర సన్నివేశాలు, నాటకాలలోని షాట్లు పంపకూడదు.

★ బహుమతి పొందని ఫోటోలు తిప్పి పంపబడాలని కోరుకునేవారు, తగినన్ని స్టాంపులు అతికించిన, స్వంత చిరునామాగల కవరును జతచేసి పంపాలి. తిప్పి పంపడానికి అన్నివిధాలుగానూ ప్రయత్నం జరుగుతుంది గాని, ఫోటోల భద్రత విషయంలో యెటువంటి బాధ్యతా స్వీకరించలేము.

★ వ్యక్తుల పేరు మీదనే ఫోటోలు పోటీకి పంపాలి. సంస్థల పేరుమీద పంపకూడదు. ఫోటో, తీసిన ఉజ్జాయింపు సమయం, యితర సాంకేతిక వివరాలు కూడా యిస్తే మంచిది.

★ ఫోటో యిదివరకు ప్రదర్శితం లేదా ముద్రితం కాదు అని స్వంతమనీ, తెలియజేసే హామీ పత్రం విధిగా ఏ 'ఎంట్రీ'తో జత చేయాలి.

★ వృత్తి ఛాయాచిత్రకారులు ఎంట్రీలు పంపరాదు అన్న నియమం లేదుగాని ఔత్సాహికులకు ప్రోత్సాహం లభిస్తుంది.

★ ఈ విషయంలో సంపాదకునిదే తుది నిర్ణయం. ఉత్తర ప్రత్యుత్తరాలకు తావు లేదు. గడువు తీరిన తర్వాత అందిన ఫోటోలను వీలు వెంబడి, మామూలు ప్రచురణకు పరిశీలిస్తాము.

★ మా కార్యాలయానికి స్వయంగావచ్చి అందజేసేవారు కూడా స్వంత చిరునామా గల తగినన్ని స్టాంపులతికించిన కవరు జతచేసి యివ్వాలి. లేదా వారికి తిరస్కరింపబడిన ఫోటోలు తిరిగి అందజేయ వీలుండదు.

ఈ పోటీ నిబంధనలు గమనించి ఎక్కువ సంఖ్యలో ఫోటోగ్రాఫర్లు పాల్గొంటారని ఆశిస్తాము. [సం]

# కురిసిన మేఘం

కరణం శేషపిళ్ళ



కౌన్సిలర్ కనకవల్లి గారిది కంచు కంఠం. మునిసిపల్ ఎలక్షన్లలో మైకు లేకుండానే ఒక ఫర్లాంగు అవతలికి గూడా నెత్తి మీద మొట్టికాయ మొట్టినట్లు శ్రోతలకి తన అసాధారణ కంఠ స్వరా సౌభాగ్యాన్ని వినిపింపజేసి నోట్లు పంచి ఓట్లు సంపాయించి ఎన్నికైన ఘనత మహిళా కౌన్సిలర్ కనకవల్లి గారిది.

మధ్యాహ్నం ఫస్ట్ పీరియడు లీజరు కావడంతో స్టాఫ్ రూంలో కూర్చొన్న సరిత కిటికీ గుండా దూరంగా వెడుతున్న సర్కార్ ఎక్స్‌ప్రెస్‌ను చూస్తూ ఉంది. ఎంతోమంది సంతోషాన్ని.. మరెంతో మంది సంతాపాన్ని సమానంగా మోయలేక మోస్తూ కర్మయోగిలా ఎక్స్‌ప్రెస్ దూరదూరంగా కనుమరుగైంది. బవాను జోగులు పొలికేక వేయడంతో ఉలిక్కిపడింది సరిత. జోగులుకు మామూలు చెముడు కాదు, బ్రహ్మ చెముడు. తన లాగే యితరులకి కూడా చెముడనుకొంటాడో యేమోగాని జోగులు ఎప్పుడూ అలానే గొంతు చించుకొంటాడు. అందుకే తనకు అతడితో మాట్లాడాలంటేనే చిరాకు. హెడ్ మిసెస్ గారు రమ్మంటున్నారన్నది అతడు మోసుకొచ్చిన సందేశ సారాంశం.

సరిగ్గా సరిత హెడ్ మిసెస్ గారి గదిలో అడుగు పెట్టడం... డిగ్రేట్ కనకవల్లి గారి కంచు కంఠం తాత్కాలికంగా ఆగడం ఒక్కసారే జరిగింది. సరిత ఆరో క్లాసు టీచరు. ఆవిడ వెనకే సరళ కూడా చేతిలో సంచీ పట్టుకొని గదిలోపలికి వచ్చి నిలబడింది. మంచి డిజైన్లలో చాలా ముచ్చటగా వున్న వియర్ బ్యాగ్ అది. సరళ ఆరో క్లాసు క్లాసు లీడరు. చదువుల్లో క్రమశిక్షణలో, ఆటపాటల్లో సరళ ఫస్టు. అందుకే సరిత సరళని క్లాసు లీడరు చేసింది. ఒక్క మాటలో చెప్పాలంటే ఆ అమ్మాయి సరితకు ఆరో ప్రాణం అంటే సరిపోతుంది.

సరిత కుర్చీలో కూర్చోడంతో హెడ్ మిసెస్‌గారు అన్నారు. "మిస్ సరితా! కనకవల్లిగారి అమ్మాయి వియర్ బ్యాగ్ క్లాసులో ఎక్కడో పోగొట్టుకుందిట. మీరేమో దాన్ని సరళ అనే యీ అమ్మాయికి యిప్పించారట. కనకవల్లిగారు కోప్పడుతున్నారు."

సరితకు ఉక్రోషం పెల్లుబికింది. కనకవల్లిగారి అహం, అజ్ఞానం సరితకు గిట్టేది కాదు. తీవ్రంగానే అనసాగింది సరిత. "మేడమ్! ముందూ వెనకా తెలుసుకోక ఆవిడగారేమో కోప్పడ్డం... మీరేమో తప్పు పట్టడం... రెండూ బాగానే ఉన్నాయి. సరళ నా కూతురా... మేనకోడలా ఊరికే యిప్పించేయడానికి?"

కనకవల్లి కలుగజేసుకొంది. "మిస్ సరితా! అధికారం చేతుల్లో వుందిగదాని పాతికరూపాయల విలువచేసే మా అమ్మాయి బ్యాగ్‌ను మీరు మీ సొంత బ్యాగ్‌లా భావించి వేలం వేయించి యితరులకి అప్పజెప్పడం... చిన్నపిల్లలతో ఆడుకోవడం విజ్ఞత కాదు."

సరితకు ఈసారి అరికాలి మంట నెత్తికెక్కింది. విసురుగా కనకవల్లి వేపు చూసి 'మీతో నా కనవసరం' అనేసి హెడ్ మిసెస్‌గారి వేపు తిరిగి చెప్పుకు పోయింది. "పదిరోజుల క్రితం ప్లేగ్రౌండులో సాయంత్రం అయిదింటి తర్వాత సరళకు ఈ వియర్ బ్యాగ్ దొరికింది. అప్పుడే జోగులికి దాన్ని హేండోవర్ చేసింది. మరునటిరోజు మీరు సెలవు పెట్టారు. అసెంబ్లీలో ఇన్‌చార్జి హెడ్ మిసెస్‌గా నేనే దాన్నిగూర్చి అందర్నీ వాకబు చేశాను. దాని పైన ఏలాంటి గుర్తులూ లేవు. ఏ వరూ నాదంటూ ముందుకు రాలేదు.

"మిస్ సరితా! అది మా అమ్మాయి తప్పుకాదు మా తమ్ముడి పెళ్ళికి గాను మేము కలకత్తా వెళ్ళాం. దాదాపు వారం రోజుల దాకా మా అమ్మాయి బడికి రాలేదు." కనకవల్లి గారి కంచు కంఠం ఉరిమింది.

"బడికి రాకపోవడం అది మీ తప్పు కాదు. రాని వాళ్ళ వస్తువుల్ని గుర్తుపట్టలేకపోవడం మా తప్పూ కాదు. అసెంబ్లీలో అందరి యెదుటా వేలం పెట్టాము. సరళ ఆరు రూపాయలకి పాడింది. ఆమెకు ఆ బ్యాగ్ యిచ్చాము. ఆ డబ్బును ఆ రోజే బీద పిల్లల నిధికి జమకట్టేశాను. జరిగింది యిది. అనవసరంగా యిక్కడ యెవరూ మాటలు పడ్డానికి తయారుగా లేరు. గుర్తుంచుకోండి."

"కనకవల్లిగారూ! ఆ బ్యాగ్మీద మీ అమ్మాయి పేరుగాని యితర గుర్తులు గాని వుండి వుంటే..." హెడ్ మిసెస్గారి నోటిమాట నోట్లో ఉండగానే కనకవల్లి అందుకొంది.

"ఆహా! హెడ్ మిసెస్గారూ! దేవలోకం నుండి సరాసరి దిగివచ్చిన న్యాయదేవతలు ఇక్కడున్నారని నాకు తెలియదు సుమండీ. లేకుంటే పేరు కుట్టించేదాన్ని..."

"కనకవల్లిగారూ! మాటలు జాగ్రత్తగా రానివ్వండి." సరిత గట్టిగానే ఉరిమింది.

"సరితగారూ! సంయమించండి ప్లీజ్! కనకవల్లి గారూ! మా స్కూల్లో యిలా జరగడం మామూలేనండి. పిల్లలు అజాగ్రత్తగా ఉండకుండా అరికట్టడానికేగాని మరేం కాదు. మీరు సరిగా అర్థం చేసుకోండి ప్లీజ్! వేలంపాటలో సరళ కొన్నదానికన్నా అదనంగా రెండో మూడో ఇచ్చేస్తే ఆమె యిచ్చేదిస్తే మీరు..." హెడ్మిసెస్గారి మాట పూర్తికాలేదు. కనకవల్లి వెంటనే బ్యాగ్ తెరిచి పదిరూపాయల నోటు ఒకటి విసురుగా తీసి సరళమీదికి విసిరింది. ఆవిడ దురుసుతనాన్నీ, అహంకారాన్నీ చూస్తున్న సరితకు ఆవిడ్ని నిలువునా దహించేయాలన్న మంటపుట్టింది. కొందరు మనుషుల్ని డబ్బు పశువుల్నిగా మారిస్తే అదే డబ్బు మరి కొందర్ని బలిపశువులుగా మారుస్తుంది. డబ్బుతో కనకవల్లిలాంటి వాళ్ళు ఈ ప్రపంచాన్నే కొనేయాలనుకోవడం... ఈ సమాజంలో యింకా ఎన్నాళ్ళు కొనసాగుతుందా అనిపిస్తుంది సరితకు. సరళ మెల్లగా ఆ నోటు తీసి హెడ్ మిసెస్గారి బల్లపై పెట్టింది. ఆవిడ దుడుకుతనానికి కొన్ని క్షణాలు నిరుత్తరురాలైన సరితను, హెడ్ మిసెస్గార్ని చూసి వాళ్ళ మెతకదనంగా భ్రమించిన కనకవల్లి సరళ చేతినుండి బ్యాగ్ను బలవంతంగా గుంజుకోవడం ప్రారంభించింది.

సరళ కళ్ళల్లో నీళ్ళు ధారగా జారి చెక్కిళ్ళపై నుండి దుముకుతున్నాయి. ఆరేళ్ళుగా ఆ కాన్వెంటుకే మోడల్ స్టూడెంటుగా పేరుపొందిన సరళ ఈనాడు కనకవల్లి అహానికి బలికావడం ఆ చిన్నారి మనస్సులో పెనుతుపాను సృష్టించింది. విస్మయంగా, ఆశగా ఆ బ్యాగ్ వేపు చూసింది. బలంగా గుంజుతూన్న కనకవల్లి చేతులకి అందకుండా రెండు చేతుల్తోనూ ఆ బ్యాగ్ను గట్టిగా పట్టుకొని గుండె కదుముకొని ఏడవసాగింది. తోకమీద లేచిన త్రాచులా లేచి కనకవల్లి పాలుగారే సరళ బుగ్గలపై గట్టిగా ఒక్కపోటు పొడిచి వీపు మీద మరోదెబ్బ వేసేందుకు చెయ్యి పైకి లేపింది.

• మరుక్షణం సరిత ఉప్పెనలా పైకిలేచి కనకవల్లి చేతుల్ని రెంటినీ ఒక్కచేత్తోనే గట్టిగా మెలిపెట్టి విదిలించి కుర్చీలో కూలబడేట్టు ఒక్క త్రోపు తోసింది. కనకవల్లి కళ్ళు నిప్పులు చెరిగాయి. "హద్దు మీరితే... జాగ్రత్త!" అని గర్జించింది సరిత.

సరళ వెక్కుతూ... వెక్కుతూ మెల్లగా అనసాగింది. "మరేనండి టీచరుగారూ! ఈ బ్యాగ్ ఖరీదు పాతికో [illegible] కావలిస్తే... ఈ బ్యాగ్ను మాత్రం దయచేసి నా దగ్గరే ఉంచమనండి... మీకు [illegible] రిస్తానండి..."

ఎంతో దీనంగా వుంది సరళగొంతు. ఆ చిన్నారి మనస్సులోని ఆవేదన ఎవరికీ అర్థం కాదు. ఏదో బలవత్తరమైన కారణం లేకుంటేగాని ఆ అమ్మాయి అలా ఆవేది కాదన్న నిజాన్ని గుర్తించిన సరిత... సరళను తన రెండు చేతుల్లోకి తీసుకొని "ఏడవకమ్మా సరళా! పాతికయినా [illegible] కనకవల్లి గారికి నే యిస్తాలే, నువ్వే ఉంచుకొందువు బ్యాగ్ని." అని తన పర్సు నుండి పాతిక తీసి కనకవల్లిగారి చేతుల్లోకి ఎంతో మర్యాదగా పెట్టబోయింది.

తారాజువ్వలా లేచిన కనకవల్లి ఆ పాతిక రూపాయల్ని ముఖంమీదే విసిరికొట్టి బ్యాగ్ వేపు చేతులు చాపింది.

సరళ తండ్రి లారీ డ్రైవరు రంగనాథం. సరిత అంటే అతనికి వినలేని భక్తి. తన అమ్మాయి సరళను సరిత నీడలో పెంచి పెద్ద చేయాలని ఆ తండ్రి తాపత్రయం. రంగనాథం బీదవాడి క్రిందే లెక్క. పాతిక రూపాయలంటే అతనికి తక్కువ మొత్తం కాదు. అలాంటప్పుడు సరళ పాతిక రూపాయలైనా ఆ పంచికే గాను యివ్వడానికి సిద్ధపడిందంటే దాని వెనక ఏదో తతంగం ఉండాలని సరిత ఊహించింది.

మామూలుగా అంది సరళతో. "అవి యితరుల సొత్తు కదమ్మా! నీ కెందుకంత పట్టుదల. ఆ పాతికా పెట్టి నేను నీకు



**జి. జి. విల్సారెడ్డి**

ఆడదానికి పళ్ళెపుష్పాలు ఇస్తే ఎక్కడలేని సంతృప్తి పుడుతుంది. మరి మగాడికి!

అది సినిమాల్లో మాత్రమే, అందుకే మన హీరోయిన్లకి అన్నేసి పూలు పెడతారు కాబోలు?!.... కోలకడుపులన్నీ, దండిగుండాలని ఉర్రూర్చేవి మల్లెపువ్వులు కాదు మంచి మనుషులు! చూడుబాబూ, తెలుగు సినిమాలు మళయాళ సినిమాలు చూసి స్త్రీ తత్వం వల్లెవేయకు—అవి స్త్రీ శరీరంగురించే ధర్మసన్నాలు వల్లిస్తాయి.

**డి. ఆర్. సికింద్రాబాదు**

మీకు చాలా గర్వం అని విన్నాను నిజమేనా?

ఆది దాకా వచ్చిందంటే నిజమే అనుకోవాలి. నిప్పులేక పొగరాదని కదా— నానుడి!

**వి. ఎస్. ఆర్. మోటూరు**

శ్రీమతి కె. రా. రాశారన్నన్నో పొసం. వారి ప్రశ్నావళి మాత్రమే జ్ఞాపకం అని కామెంట్ చేసిన శ్రీ రచయిత కలం అప్పుడప్పుడు అబద్ధం రాస్తుందంటాను. ఎందుకంటే కొందరు రచయిత్రులను గూర్చి నిష్పక్షపాతంగా చెప్పేవారు మీ గూర్చి నిజం నిర్ధారించలేక పోవడం ఏమిటి?

బహుశా వారికి తెలిసిన నిజం అంతేనని ఎందుకు అనుకోకూడదయ్యా! గయ్యాళిగా నాకిప్పేరు వుంటారు. 'ఎందుకొచ్చిన గొడవ? ఈమధ్య యీ కె. రా. ఘాటైన మరీకపులన్నీ, విమర్శకులని ఒల్పుకు తింటూంది' అని పూర్వకుని వుంటారు.

**జి. ఎమ్. ఎమ్. తెనాలి**

ఎ. ఎస్. ఆర్.కి కథ రాశారని విని చాలా ఆనందించాం. మీ ఫోటో పంపిస్తారా?

థ్యాంక్యూ —ఎటొచ్చి —ఎ. ఎస్. ఆర్.కి కథరాయలేదు. వారికి ఒక్కొక్కకథరాశాను!, ఇక పటించేది నిత్య యవ్వనులదేగాని నేను కాదుకదా! వారి ఫోటో అడిగితే బాగుంటుంది. ఏమంటారు?

**జె. బి. ఆర్. ఖరగ్‌పూరు**

నిజమైన స్త్రీ ఎలా వుండాలి?

కనబడకూడదు! వినబడకూడదు!! చేతికి అగిలేలా




వుంటే చాలు!!! కనబడినా వినబడినా మనిషి అవుతుంది. లేక పోతే శరీరం అవుతుంది. మనిషికి కొన్ని లక్షణాలుంటాయి. ఉద్దేశ్యాలుంటాయి. శరీరానికి అవసరాలే వుంటాయి. మనిషిగా ఆడదాన్ని గౌరవించలేరు చాలామంది. కానీ శరీరంగా వాడుకొందుకు అత్యావసర వస్తువు ఆమె. అందుకే ఆడదీనాడు సజీవ జడపదార్థంగా అన్నిరంగాలలోనూ వాడుకోబడుతోంది!

**వి. డి. ఆర్. హైదరాబాదు**

మీ ఆడవారు మగవారిని వలలో వేసుకొనేటందుకు హైవోల్టేజి పవరుందంటారు. అది ఏసీ-కాదట.

టు! అంటే ఎలా? అసలంత హైవోల్టేజి వుంటే రద్దీ సమయంలో రహదారుల్లో బస్సుల్లో స్త్రీని యిష్టం వచ్చినట్లు తాకి అసభ్యంగా ప్రవర్తించే వాళ్ళంతా ఎప్పుడో విద్యుద్ఘాతం పాల్పడి వుండాలి!

**ట్రి. వి. ఆర్. ఎమ్. గుడివాడ**

కొడుకు ప్రేమించి చెడిపోయిన ఒక ఆడదాన్ని ఒక తల్లి తన కోడలుగా స్వీకరించినట్టుగా చూపించారొక సినిమాల్లో. అటువంటి తల్లులు ఎంతమంది వుంటారీ లోకంలో?

అలాంటి తల్లులు వుండచ్చేమో గాని, అలాంటి స్త్రీని స్వీకరించి— ఆమె గత చరిత్రను జ్ఞప్తికి తెచ్చుకోని మగవాడు మటుకు వుండడని గ్యారంటీగా చెప్పవచ్చును.

**జి. ఆర్. మహబూబ్‌నగరు**

క్రికెట్ మ్యాచ్‌మీద, సినిమాల మీద ఉన్న ఉత్సాహం నేటి విద్యార్థులకు చదువుపై ఎందుకు లేదు?

చదువులో ఏముంది ఉట్టి బోర్! పాఠ్యగ్రంథాలే బోర్ అంటే అవి చెప్పేవారి తీరూ మహామహాబోర్ అంటున్నారు విద్యార్థులు. ఏమీలేని యీ పుస్తకాలు చదువుకంటే క్రికెట్, సినిమాల్లో కాస్త థ్రిల్‌వుందికదా! ఇచ్చినడబ్బు దండుగైపోయిందనుకోకుండా అటు కపిల్‌దేవ్‌నైనా వుంటాడు. ఇటు జయమాలినేనా ఉంటుంది!

**వె. ఆర్. పాలకొల్లు**

ఆ దేవుడు పురుషుడి హృదయం రాయితోను, స్త్రీ హృదయం వెన్నతోను చేశాడు అంటారు. నిజమేనా?

కనీసం రాతి హృదయానికి వెన్న పూతైనా వుంటుందని అలాచేసి వుంటాడు దేవుడు చెప్మా?

**వె. బి. ఆర్. మొలగవల్లి**

మన కష్టాలను దేవాలయంలో దేవునిముందు నిలబడి భక్తితో చెప్పే సమయంలో పక్కన అమ్మాయి వచ్చి నిలబడితే ఎలా వుంటుంది?

ఇంకానయం! అమ్మవారిని చూసి కళ్ళు చెదిరితే ఏం చెయ్యాలి అన్నారు కాదు! అమ్మాయి నిలబడితే చెదిరిపోయేభక్తి — భక్తి కాదు. అనుభవాల్లు చాలా వుంది. ఆలయాలకి భక్తికోసం కంటే మీలాగా రక్తికోసమే వెడుతూ వుంటారు. అందుకే చాలా విచిత్రంగా దేవాలయాల్లో, సాయం సమయంలో యువతీయువకులే ఎక్కువ కన్పిస్తూ వుంటారు!

**ఎస్. ఆర్. సి హెచ్. అమలాపురం**

ఒకవేళ మగవాళ్ళు ప్రేమించడం మానేస్తే?

ఏం భయంలేదు. ఈ సృష్టి ఆగిపోతుందనుకోకండి. ప్రేమకీ సృష్టికీ కాదు యీ సంఘంలో వైవాహిక బంధం. పెళ్ళికి ఇతర కారణాలన్నీ కారణం అవుతున్నప్పుడు — ప్రేమతో పనిలేదు!

ప్రాచీనకాలపు స్త్రీలు భర్తలను దైవంగా ఆరాధించేవారట. మరినేటిస్త్రీలు ఏవిధంగా ఆరాధిస్తున్నారు?

తన్—మన్—ధన్ లు సర్వం అర్పించి!

హృదయకవాటం తెరుచుకోవాలంటే?

దానికో మూగభాష వుంది. అది హృదయానికే తెలుస్తుంది.

---

విజయవాడలో అల్లాంటి బ్యాగే కొని తెస్తానుగా. ఇచ్చెయ్యవూ!" వింతో అనునయం వుంది ఆ గొంతులో.

సరళ ఈసారి మరీ కుంగిపోయింది. కంటికీ మంటికీ ఏకధారగా యేడుస్తూ నిస్సహాయంగా సరిత వైపు చూసి వింతో బలవంతంగా ఉబికి వస్తున్న దుఃఖాన్ని అపుకొంటూ పంచిని గుండెకి మరీ గట్టిగా అదుముకుంటూ అనసాగింది,

"టీచర్ గారూ! మరేనండి ఆ పూట దీన్ని వేలంలో పాడి యింటికి తీసికెళ్ళాను

## కురిసిన మేఘం

గదండి. ఆ రోజే మా చెల్లాయి...నాకు ఒక్కటే చెల్లాయండి...దీనిమీద తన పేరు కుట్టించు కొందండి మా అమ్మ చేత. మా చెల్లాయండి మూడు రోజుల క్రితం మమ్మల్ని అందర్నీ వదిలేసి తాను ఒంటరిగా దేవుడి దగ్గరికి వెళ్ళిపోయిందండీ. ఇక ఎప్పుడూ రాదంటండి. మా అమ్మా నాన్నా మూడు రోజులుగా అన్నం తినడంలేదండీ, ఏడుస్తున్నారండీ టీచర్ గారూ. ఈ పేరు చూసినప్పుడల్లా మా చెల్లాయిని చూసినట్లు అనిపిస్తుందండి నాకు. అందుకే నండి యీ బ్యాగంటే నా కంత యిష్టం. కావలిస్తే కనకవల్లిగారి కాళ్ళు పట్టుకొంటానండి. ఈ బ్యాగ్‌ను మాత్రం..."

దుఃఖంతో గుండెలు చెరువు కాగా కనకవల్లి వేపు గుచ్చి చూసిన సరితకు కనకవల్లి కళ్ళల్లో ధారాపాతంగా కారుతూన్న కన్నీళ్ళు దిగ్భ్రమను కలిగించాయి. కనకవల్లి వింతో భారంగా "వద్దు తల్లీ! ఆ బ్యాగ్‌ని నువ్వే వుంచుకో నే వెళ్తాను." అని సరళతో అనడం అక్కడున్న వారందరికీ స్పష్టంగా వినబడింది.



# ప్రెసిడెంట్ గారి భార్య

పెద్దకథ

జొన్నలగడ్డ లలితాదేవి

(గత సంచిక తరువాయి)

నెలలు నిండి ఒక శుభముహూర్తాన అనసూయ ఆడపిల్లని కన్నది. కృష్ణశర్మ విగ్రహం తెలియని పెద్దలు "తొలిగా ఆడపిల్ల ఇంటికి లక్ష్మి రెండోసారి మగ బిడ్డ పుడతాడులే!" అనుకుంటూ ఆనందించారు.

కృష్ణశర్మ రవ్వంత విచారించాడు. తన వారి కోరిక ప్రకారం వంశోద్ధారకుడు పుట్టివుంటే తనకి సుఖంగా వుండేదిగదాని నిట్టూర్చాడు.

బారసాల పీటలమీద కూర్చుని "పద్మావతి" అని నామకరణం చేశాడు. ఆరోజే భార్యతో ఖచ్చితంగా చెప్పేశాడు.

"అనసూ! మనం లోకానికే భార్యాభర్తలం. శారీరకంగా మనకింక ఏం సంబంధమూ లేదు. ఆ విషయం బయటికి పొక్కిందా నిన్ను నీ పిల్లనీ వదిలిపోతాను. అర్థమయిందా? ఏ శారీరక సుఖాలు లేని శారదా, రామకృష్ణ పరమహంస దంపతులలా వుండాలి మనం. ఈ రోజునించి నువ్వు నాకు భార్యవి కాదు: తల్లితో సమానమైన దానివి. అంటే పాపం అర్థంకాక తెల్లబోయింది. ఆ పదిహేనేళ్ళు నిండుతున్న పడుచు.

తండ్రి ఏదో కష్టపడి సంపాదిస్తూ ఏదో వున్న అరవకరంపాలంతో కుటుంబాన్ని ఈడ్చుకు వస్తుంటే నిశ్చింతగా పూజా ద్రవ్యాలు ముందు పెట్టుకుని గంటలకి గంటలు పూజలతో గడిపివేయసాగాడు కృష్ణశర్మ. పూజలయిపోగానే ఏ దేవీ భాగవతమో, ఏ రామాయణమో, భారతమో దగ్గర పెట్టుకుని కూర్చునేవాడు. ఇదే అతని దినచర్య.

పిల్లకి రెండేళ్ళు వస్తున్నా కోడలు మళ్ళీ నీళ్ళు పోసుకోలేదని ఇంటికి వచ్చిన వారి అందరిదగ్గరా అనడం. అనసూయ విని బాధపడేది కాని నోరెత్తేది కాదు.

ఇంట్లో పని అంతా అనసూయే చూసేది. తీరుబడిగా కూర్చుని వంశోద్ధారకుడు పుట్టలేదని బెంగపడుతుండేది అత్తగారు.

పద్మావతికి అయిదేళ్ళు వచ్చేసరికి ఇంక కోడలు కడుపు పండుతుందన్న నమ్మకం పోయింది కామాక్షమ్మకి.

కొడుకు ఇల్లు పట్టించుకోకపోవడం. కోడలికి మళ్ళీ పిల్లలు కలగక పోవడం ఇవన్నీ కామాక్షమ్మలో అనసూయ పట్ల నిరసన భావాన్ని కలిగించాయి.

"మాయింటి ఆనవాయితీ ఒక్క బిడ్డే: అలాగే నా అబ్బాయికీ ఒకరే పుట్టారు. మా కర్మకాల్లి అది ఒక్కత్తీ ఆడపిల్ల అయి కూర్చుంది." అంటూ ప్రతి వారి దగ్గరా ఏడుపులు, రాగాలతో బాటు పద్మని విసుక్కోవడం. రాను రాను కొట్టడం వరకూ సాగించేసరికి ఇంక భరించలేక పోయింది అనసూయ.

"మీరెప్పటిల్లా నేను గొడ్డుదాన్నికాద్ప

పెళ్ళి తర్వాత ఇంక మనకేం సంబంధం వద్దు అని మీ అబ్బాయి దూరంగా వుంటున్నారు." అంటూ బావురుమని ఏడ్చింది అనసూయ.

ఆ మాట విని నిలువునా నిర్ఘాంతపోయింది కామాక్షమ్మ. ఆ మాటే భర్తతో చెప్పింది. విని మండిపోయాడు తండ్రి నారాయణశర్మ.

"నీకిదేం పోయేకాలం. నిక్షేపంలా భార్యతో కాపురం చేసుకొని పదిమంది బిడ్డలనెత్తి కాస్త డబ్బూ, ధన్యం సంపాదించుకోంటావా : ఇలా ప్రాణలంట్లూ వంటగదిలో పెట్టుకుపోతావా?" అంటూ చివాట్లు పెట్టాడు కొడుకుని.

అంతే : కృష్ణశర్మకి భార్య మీద ఆగ్రహం మిన్నుముట్టింది. తను చెప్పిన దానికి విరుద్ధంగా ప్రవర్తించి భార్య అవిధేయురాలయిందని దుర్భాషలాడి ఆ రాత్రి కి రాత్రే కాలినడకన ఇల్లు విడిచి వెళ్ళిపోయాడు. ఆనాటి నించి ఈనాటి వరకూ చచ్చాడో బతికాడో కూడా తెలియకుండా పోయాడు. కాశిలో వున్నాడని, బదరీనాథ్ పోయాడని రకరకాలుగా చెప్పుకున్నారు.

ఉన్న ఒక్క కొడుకు సన్యాసి అయిపోవడంతో నారాయణశర్మ దంపతులు గుండెలు బాదుకున్నారు. వీటన్నింటికీ కారణం అనసూయేనని తిట్టిపోశారు. "నువ్వే సరిగ్గా ప్రవర్తిస్తే వాడు సన్యాసం ఎందుకు పుచ్చుకుంటాడు?" అని విమర్శలు చేశారు.

"ఈ పాపిష్టిది ఏ నక్షత్రంలో పుట్టిందో గాని కొంపని ఛిన్నాభిన్నం చేసింది" అంటూ పద్మావతిని చావబాదారు.

ఈ విధంగా తిట్లు, తిరస్కారాలతో పెరిగి పెద్దదయింది పద్మావతి. అనసూయ పరిస్థితి మరీ విషాదంగా మారిపోయింది. పన్నెండేళ్ళుదాటి భర్త రాలేదుకనుక వితంతువు క్రిందే లెక్కవేసి జుట్టు తీయించారు. గాజులు, మంగళసూత్రం తీయించేసి పూర్తిగా వితంతువుగానే తయారు చేశారు. తల్లినలా చూడటానికి భయపడేది పద్మావతి. అనసూయ ఆ యింట్లో ఎన్ని బాధలు భరించిందో ఆ పరమాత్మకే ఎరుక. వున్న అర ఎకరం పొలం వృద్ధాప్యంలో తిండికోసం అమ్మేశాడు మామ. చివరికి ఈ బాధలన్నీ

---

*జరిగిన కథ.* పంచాయితీ బోర్డు ప్రెసిడెంట్ పూర్ణానందం కొడుకు రామకృష్ణ ప్రసాద్ కంటే, ఇంట్లో పనిచేసే పద్మావతి కొడుకు శ్రీకాంత్ చదువులోను, అందంలోనూ ముందంజ వేస్తున్నాడని ఈర్ష్య చెందుతూ వుంటుంది అతని భార్య కామేశ్వరి. శ్రీకాంత్ తన కొడుకేనని గుట్టు బయలు చేస్తుందని నగ దొంగిలించిందనే నేరం మోపి పద్మావతిని జైలుకి పంపిస్తాడు పూర్ణానందం. తోగడ అతని వత్తిడి వల్ల తప్పించిందానికి ప్రాయశ్చిత్తంగా శ్రీకాంత్‌ని విజయవాడ హాస్టల్లో చేర్పిస్తాడు పంతులు

---

భరించలేక ఓనాడు నూతిలోపడి తన జీవితాన్ని దుఃఖాంతం చేసుకుంది అనసూయ.

వృద్ధాప్యంలో సంపాదించవలసిన కొడుకు, దాదిరి 'యాత్ర'న కోడలు దాటిపోయేసరికి పద్మావతే దిక్కు అయింది.

చివరికోనాడు భద్రాద్రి రాముని దర్శనానికి లాంచీలో వెళ్ళినప్పుడు శ్రీరామునితో ఐక్యం అయిపోయారు ప్రమాదంలో మునిగిపోయి. ఇన్నివిధాలా ఒంటరిదయిన పద్మావతి ఏడవని రోజు లేదు. తన తండ్రి అన్ని పూజలు చేశాడు. కాని ఏదేవుడూ వచ్చి తనని ఆదుకోలేదు. పొట్టచేతబట్టుకొని పక్కగ్రామంలో ప్రెసిడెంట్‌గారింట్లో పనికి కుదిరింది. ఆమె యవ్వనం, అందం మొదటే ఆకర్షించిన పూర్ణానందం ఎన్నాళ్ళ ఆశ సోపాలు, పడే భార్య కామేశ్వరి దగ్గరనుండు నువ్వు అంటూ చేర్చాడు. ఆమె ఏ కులమ్మో చెప్పలేదు. కామేశ్వరికి తొలిగా ఆడపిల్ల పుట్టింది. ఆ పిల్లే పార్వతి.

ఆ తర్వాత గర్భంరాను, పోనుగా మూడు నాలుగు అయ్యాక నీరసం అంటూ కూర్చునేసరికి పట్నంలో మందిప్పిస్తా ఇంటి దగ్గర, వేళకి మందు ఇయ్యడానికి అంటూనే కుదిర్చాడు ముందు పద్మావతిని.

"నువ్వు ఇక్కడే భోజనం చెయ్యి" అని అడిగినప్పుడు "నాకు ఒక పాక ఇప్పించండి. నేను అక్కడే వండుకు తింటాను," అని అన్నది. అప్పుడు పూర్ణానందమే గ్రహించాడామె ఏ కులస్త్రీలో. అందుకు

# బ్రూ-కమ్మని రుచికి, సువాసనకి మొదటి రకము

## దక్షిణ భారత దేశంలోని కాఫీ అభిమానులను అడగండి. మీ పొరుగు వారిని అడగండి.



సుశీలా రవీంద్రనాద్, ఇల్లాలు.
మా కుటుంబం బ్రూ కు అలవాటుపడింది. అందుకే గాక నా బడ్జెట్ కు కూడా సహకరిస్తుంది.



విజయ కుమార్ రావు, క్రికెట్ ఆటగాడు.
గ్రౌండు కాఫీ సువాసనను మరేదీ ఎదిరించ లేదు, అందుకే బ్రూను కోరుకుంటాను.



శ్రీ మరియు శ్రీమతి హరిశంకర్, నూతన దంపతులు.
మేము ఇష్టపడేది సారమైన కాఫీ అయితేనే —బ్రూ అనుకూలమైనది కూడా.



శ్రీ. కృష్ణమూర్తి, ప్రిన్సిపాల్.
దబరాలో పొగలు కక్కే, రుచికరమైన, సారవంతమైన కాఫీనే ఇష్టపడతాను.




బ్రూ—దాని వెల ఎంతో ఆకర్షణీయమైనది
ఏ కాఫీ అభిమానిని అయినా అడగండి

OBM-5708A/1 TEL

# వారఫలం

—మహేష్—

**13-4-1979 శుక్రవారం మొదలు**
**19-4-1979 గురువారం వరకు**

**మేషం:—** రావలసిన డబ్బు అందుతుంది. నూతన వ్యవహారాలు బాగుంటాయి. వారం మధ్యలో శ్రమ కలుగుతుంది. మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. అనవసరమైన వ్యయం జరుగుతుంది.

**వృషభం:—** వృత్తిలో పోటీవారి పోటీ పెరుగుతుంది. మీ కార్యక్రమాలకు మార్పులువస్తాయి. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. వారం ఆఖరులో చేజిక్కిన అవకాశాలు కూడా జారిపోవచ్చును. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. ఎవరితోను వాదప్రతివాదాలు తగవు.

**మిథునం:—** వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. అనవసరమైన సందేహాలు కలుగుతాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. స్త్రీలకు కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కర్కాటకం:—** మీ కార్యక్రమాలు అడావుడిగా వుంటాయి. పోటీవారిలో గౌరవం లభిస్తుంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. పోటీ వారితో మాట పట్టింపులు తగవు. స్త్రీలకు— ఆరోగ్యంబాగుంటుంది. దైవకార్యాలునెరవేరతాయి.

**సింహం:—** అనుకూలమైన వార్త వింటారు. రాజకీయవ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగిస్తుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీకృషి లాభించగలదు. స్త్రీలకు— బంధు మిత్రులను కలుసుకొంటారు. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కన్య:—** మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో పోటీవారి పోటీ తగ్గుతుంది. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు అడావుడిగా ఉంటాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**తుల:—** వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది. మీ ఆలోచనలు ఫలిస్తాయి. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. పోటీవారిలో గౌరవం లభిస్తుంది.

**వృశ్చికం:—** ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం మధ్యలో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. బంధుమిత్రులను కలుసుకొంటారు.

**ధనుస్సు:** వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం మధ్యలో శ్రమ కలుగుతుంది. సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం ఆఖరులో మీ కార్యక్రమాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. స్త్రీలకు—

శ్రీమతి సి. ఆనందారామం రచించిన "మళ్ళీవచ్చిన వసంతం" నవలను మార్చి 3వ తేదీన డా. సి. నారాయణరెడ్డి ఆవిష్కరించారు. శ్రీ దేవులపల్లి రామానుజరావు అధ్యక్షతన డా. శ్రీమతి లక్ష్మీ రఘురామ్ నవలని అంకితంగా స్వీకరించారు. డా. శ్రీమతి నాయని కృష్ణకుమారి ప్రసంగించారు.



Add more to your life

Drink

# Nova Cola*







*Artificially flavoured

అంగీకరించి పని అయి ఇంటికి వెళ్ళేప్పుడు రోజూ స్వయంపాకం ఇచ్చి పంపించేవాడు.

పద్మావతి వచ్చిన ఆరు నెలలకల్లా గర్భవతి అయింది కామేశ్వరి. అది తెలిసిన రోజున "ఈసారి నీచేతి చలవవల్ల నాకు కొడుకు పుట్టాలి" అన్నాడు పద్మావతి కామేశ్వరికి మందు కలిపిస్తుంటే. ఆ రోజుల్లోనే పద్మావతి మీద వ్యామోహం పెంచుకున్న పూర్ణానందం ఆమెని భయపెట్టి, బెదిరించి, మొత్తానికి లొంగదీసుకున్నాడు. చివరకి పద్మావతి కూడా గర్భవతి అయింది.

అది పూర్ణానందంతో చెప్పి ఏడ్చింది.

"నువ్వు అనవసరంగా ఏడవకు. నేను చెప్పినట్లువిను. చేసేది చూడు" అన్నాడు.

ఆ మర్నాడు పద్మావతి పెళ్ళి అంటూ ఓ పదిమందిని పోగేశాడు. ఓ కుర్రాడిని తెచ్చాడు. అతనికి పద్మకి పెళ్ళి చేయించాడు. అంతా అతని ఔదార్యానికి హర్షం వెలిబుచ్చారు. అంతే ఆ సాయంత్రానికి ఆ పెళ్ళయిన వాడెవడో కనిపించలేదు.

"పద్మావతి మొగుడు పట్నం వెళ్ళాడు పని మీద" అని రెండు నెల్లల తర్వాత అందరికీ చెప్పాడు. అంతా నిజమేననుకున్నారు. ఎప్పుడయితే పద్మ తన వల్ల గర్భవతి అయిందో అప్పుడు ఇంట్లో వంట దగ్గర్నించి చేయించసాగాడు. కామేశ్వరి గర్భవతి కనుక ఆమె మంచం దిగలేదు అంటూ. ఆ విధంగా అతని బిడ్డ గర్భాన పడేసరికి తన కులం కూడా మర్చిపోయింది పద్మ. అయితే చిత్రం ఏమిటంటే నెలలు నిండి కామేశ్వరి కన్నరోజున, నెలలు పూర్తి కాకుండానే పద్మ కూడా బిడ్డని కన్నది. ఒక్కసారే తనకిద్దరు కొడుకులు పుట్టడంతో కొంచెం అనుకోకుండానే తత్తరపడ్డాడు పూర్ణానందం. అది కూడా ఆ రోజే గ్రహించింది పద్మావతి.

సంగ్రహంగా తన కథ యిది.

"ఇప్పుడు తన కొడుకు పరిస్థితి ఏమవుతుంది? ఎలా వుంటుంది? ఒక అధికారంలోని మగవాడు ఎన్ని విధాలుగా నొక్కిపట్టాలనుకున్నాడో అన్ని విధాలుగానూ తొక్కిపట్టాడు తనని. ఇలాంటి వాడు ఆ పిల్లాడిని మాత్రం పైకి రానిస్తాడని నమ్మకం ఏముంది?

వాడిమీద కూడా ఏదో నేరం అంటగట్టి ఈ పాటికి ఏ పిల్లల జైలుకో పంపి వుంటాడు." అనుకుంటూ చీర తడిసేలా రోదిస్తూ కూర్చుంది పద్మావతి. "ఆ జైలు గోడలకే ప్రాణం వుంటే ఆమె కన్నీటిని ఎలుగెత్తి చాటి చెప్పేవి లోకానికి. అవి రాళ్ళు కనుకే నిశ్చలంగా వున్నాయి. నిబ్బరంగా చూస్తున్నాయి. ఆమె దుఃఖాన్ని. "తనీ జైలునించి ఎప్పటికి బయటపడుతుంది" అనుకుంది ఆవేదనగా. "పూర్ణానందమే తన బిడ్డను తీసికెళ్ళి వుంటాడా? తీసికెడితే వాడిబతుకింక చెప్పనక్కర్లేదు." అనుకుంది తల బాదుకుంటూ.

## 6

శ్రీకాంత్‌ని వెంటబెట్టుకుని తిన్నగా విజయవాడ వచ్చాడు పంతులు. ఏదయితే అదే అయిందిలెమ్మని ముందు ఒక ఎలిమెంటరీ స్కూలు దగ్గరకు తీసుకువెళ్ళాడు.

అతని పరిస్థితిఅంతా చెప్పి స్కూల్లో చేర్చుకోవడంతోబాటు ఇంట్లో ఆపనీ ఈపనీ చేయించుకుని, కాస్త అన్నం పెట్టి, రాత్రికి పడుకోవడానికి ఆశ్రయం ఇచ్చే వాళ్ళని చూపించమనికోరాడు.

"ఏమాత్రం శ్రమపడేకంటే ముందు ముందు ఈ అబ్బాయికి లాభిస్తుంది. వెనకపడిన తరగతులు, షెడ్యూల్డు కాస్ట్ క్రింద ఆ అబ్బాయిని చేర్చండి. ఆ పిల్లాడు డాక్టరైనా, లాయరైనా, ఇంజనీరైనా ఏదికావాలన్నా ఛాన్సువుంటుంది. అతన్ని గవర్నమెంటు పెంచి పెద్దవాణ్ణిచేస్తుంది. ఉద్యోగంకూడా తొందరగానే వస్తుంది." అంటూ సలహా యిచ్చాడు. పంతులు ఆలోచనలో పడ్డాడు.

"అందాకా ఇక్కడే చదువుకుంటూ వుంటాడు. తిండికి మట్టుకు పోస్టు కుర్రాళ్ళని పెట్టుకోండి. ఏదో బాయ్‌లాగా ఉపయోగించుకుని అయినా కాస్త తిండి పెడతారు". అని మరో సలహా యిచ్చాడు.

అక్షరాలా అదేపనిచేశాడు. పాపం ఆ కుర్రాళ్ళు అంగీకరించారు. అందుకే సంబరపడి పిల్లాడినక్కడేవదిలేసి మరో వారంలో వస్తానని ఈలోగా అవసరమైతే ఉత్తరం వ్రాయమని అడ్రసుచెప్పి ఆరోజే హెడ్మాస్టరు పెట్టమన్న అప్లికేషన్ పెట్టి ఇంటికి వెళ్ళిపోయాడు పంతులు.

శ్రీకాంత్ తెలివి, చురుకుతనం హెడ్మాస్టర్ని బాగా ఆకట్టుకున్నాయి అంచేత నాలుగవ తరగతిలో వేసి శ్రద్ధగా చూసుకోసాగాడు.

రాత్రిళ్ళు తల్లి గుర్తు వచ్చి ఏడ్చినా ఆ చిన్న మనసులో ఏ నిర్ణయం వుందోకాని తెల్లారి మళ్ళీ పుస్తకాలే ప్రపంచమయ్యేది.

తనయింట్లో దొంగతనంపై పద్మావతి మీద పెట్టిన కేసు విచారణకు హాజరయ్యాడు పూర్ణానందం.

"తల్లి దండ్రీ లేనిదని జాలిపడి మా యింట్లో పనికి పెట్టుకున్నాను. నాకుఆస్తి బోలెడు వుంది. ఒక్కత్తి తింటే ఏం పోయింది లెమ్మనుకున్నాను. మా ఆవిడ



నేను పద్మావతంటే వింతో సానుభూతి చూపుతుండేవాళ్ళం. ఆమెకి పెళ్ళి కూడా మేమే చేశాం. డబ్బిచ్చి ఏదో పని మీద పంపిస్తే ఆ అబ్బాయి ఆ డబ్బుతో అలాగే వెళ్ళిపోయినా పోనీలే రెండువందలేగదాని పూరుకున్నాను. అది అలుసయినట్టుంది. పద్మావతి ఏకంగా పాతిక కాసుల చంద్ర హారం లాగేసింది. అందుకే నేను కేసు పెట్టాను." అంటూ చెబుతుంటే అతని కేసి అసహ్యంగా చూసింది పద్మావతి. ఆ చూపు గమనించి తలవంచుకున్నాడు పూర్ణానందం. అది వినరూ గ్రహించకపోయినా జడ్జి మాత్రం స్పష్టంగా గ్రహించాడు.

"నువ్వేమన్నా చెప్పుకుంటావా?" అని అడిగాడు పబ్లిక్‌ప్రాసిక్యూటర్. "నేను ఏం చెప్పినా వినరూ వినరు. అందువల్ల చెప్పి లాభంలేదు" అంది నిబ్బరంగా.

"ఫర్వాలేదు. నువ్వు చెప్పదలచింది చెప్ప వచ్చు. నువ్వుదొంగతనం నిజంగాచేశావా?"

"లేదు. నాకు దొంగతనం చేయాల్సిన అవసరంలేదు అయితే అది నిరూపించడం నావల్లకాదు వస్తువు నాయింట్లో వుంది కనుక నేను దొంగననే భావిస్తారు. అంచేత నేను ఏదీ చెప్పను." అని మౌనం వహించింది. కేసు వాయిదాపడింది. పూర్ణానందం ఇంటికి వెళ్ళిపోయాడు. సరిగ్గా వారానికి పంతులు మళ్ళీ వచ్చాడు.

"మీరింక ఆ పిల్లాడిగొడవ నాకువదిలేయండి. నేను ముందే చెప్పినట్టు వెనక బడిన జాతుల కుర్రాడిగా ఆ అబ్బాయి విద్యా, ఉద్యోగాలకి ఢోకాలేకుండాచూస్తాను. దానికి సంబంధించిన కాగితాలన్నీ నేను, మా బావమరిది పూర్తిచేసి పంపేశాము. మీరింక రానక్కరలేదు." అని చెప్పాడు.

పంతులు కృతజ్ఞతగా చూసి "ఏదో ఆ పిల్లవాడికోసం శ్రమ పడ్డారు. ఈ డబ్బు మీదగ్గర వుంచండి." అంటూ ఓ పాతిక రూపాయలు అక్కడపెట్టి వెళ్ళి పోయాడు. పిలుస్తున్నా వినిపించుకోకుండా. అప్పటికి పంతులు మనసు శాంతించింది. కొంతవరకైనా పద్మావతికి సాయబడ్డానుగదాని సంతుష్టిపడ్డాడు.

కేసు వాయిదా రోజున మళ్ళీ హాజరయ్యారు. అప్పుడుకూడా చెప్పిందేమీ లేదు పద్మావతి.

ఆ మర్నాడే తీర్పు చెప్పాడు జడ్జి.

ప్రెసిడెంట్‌గారి అబ్బాయి

"నెలరోజులు సాధారణజైలుమాత్రమే" నంటూ. ఆర్నెల్లు కఠినశిక్ష విధించకపోతా డనుకున్న పూర్ణానందానికి నెలరోజులు సాధారణ జైలుశిక్ష మాత్రమే వేసేసరికి కాస్త నిరాశ పడ్డాడు.

నెలరోజులు పూర్తి అయి పద్మావతి తిరిగి వచ్చింది. వచ్చింది తిన్నగా పంతులు ఇంటికే వెళ్ళిందికాని పూర్ణానందంయింటికి కాదు. అప్పటికి చీకటి పడింది. పంతులు ఒక్కడే వీధి అరుగుమీద కూర్చుని లాంతరు వెలుగులో పిల్లలుచేసిన హోంవర్క్ దిద్దు కుంటూ పద్మావతికేసి బాధగా చూశాడు.



"మా శ్రీకాంత్ ఏమయ్యాడు? అక్కడే వున్నాడా?" అని అడిగింది ఆదుర్దాగా:

"లేదమ్మా: అతన్ని బెజవాడ తీసుకు వెళ్ళి ఒకరికి అప్పగించాను." అంటూ జరిగినకధంతా వినిపించి

"నీ బిడ్డ దగ్గరకు వెడతావామ్మా:" అని అడిగాడు.

పద్మావతి మాట్లాడకుండా ఆలోచనలో పడింది. మరో రెండు నిమిషాలకి తేరుకుని "వద్దు బాబూ: మీరు వాడికి మహోపకారం చేశారు. వాడినలాగే పెరగనీయండి. తల్లి దొంగ. తండ్రిలేడు అంటూ లోకంచూసే చిన్నచూపుకు, అవహేళనలకు వాడు గురి కాకుండా వుండాలంటే అదే సరి అయినా మార్గం. నాలాంటి దౌర్భాగ్యపుతల్లి లేనంత మాత్రాన వాడికి వచ్చిన నష్టంలేదు నేను వాడిని పైకి తీసుకురాగలశక్తి ఏటూ లేని దానినే: అందుకే అన్ని మమకారాలూ వదిలి పెట్టుకున్నాను. ఇంకసెలవు." అంటూ ఆ నీరవనిశీధినిలో కలిసిపోయింది పద్మావతి. వెళ్ళే ఆమెనే చూస్తుండిపోయాడు చాలా సేపు. నెలదాటి పదిహేను రోజులయినా వస్తుందనుకున్న పద్మావతి రాకపోవడం పూర్ణానందాన్ని ఆశ్చర్యంలోనే ముంచింది.

పద్మావతి ఆనాడువచ్చి ఆ చీకట్లో తన దగ్గరవున్న చిల్లరంతా పోగుచేసుకుని బస్‌లో విజయవాడకు మూడున్నర వంతులుదూరం ప్రయాణంచేసి మిగిలినదూరం కాలినడకనే చేరుకుంది.

అక్కడ ఒకరింట్లో పెళ్ళిజరుగుతుంటే ఏదన్నా పనిచేసి పెడతాను కాస్త కాఫీఇవ్వండి అని బతిమాలుకుంది.

వాళ్ళు దయదలచి ఒప్పుకున్నారు ప్రతి పని అందుకుని చురుగ్గా చేసి పెట్టడంతో వాళ్ళు సంతోషించి భోజనం, కాఫీయేకాక ఓ అయిదు రూపాయలు కూడా చేతిలో పెట్టారు. పెళ్ళి హడావుడి తగ్గేదాకా అక్కడే వుంచుకుని

అవి తీసుకుని వారికి నమస్కారం పెట్టి తిన్నగా కృష్ణానదిలో స్నానంచేసి అక్కడ వించే నిశ్చలంగా కనకదుర్గాదేవికి నమస్కరించుకుని మద్రాసు మెయిల్ ఎక్కుతూ తన దగ్గరవున్న డబ్బుకు టిక్కెట్టు కొనుక్కుంది. "అయితే టి సి. ఆమె దిగ బోయేముందు స్టేషనులోనే , చెక్‌చేస్తే దిగడంతో తనిలాగే మద్రాసు దాకా వెళ్ళిపోతే ఏమవుతుంది ?" అనుకుంది మొండిగా.

"ఏమయితే అది అయింది ఏలాగైనా తను మద్రాసు చేరాలి. భగవాన్ మళ్ళీ టి. సి. రాకుండా కాపాడు." అని నమస్కరించుకుంది.

"టి. సి. వస్తే మధ్యలో దిగవందుకు చివాట్లు పెడతాడు." అనుకుంది అదిరిపాటుతో.

మళ్ళీ చెకింగ్‌కి వచ్చేటప్పటికి ఆమె లావెటరీలో వుంది అపూట ఆ థర్డ్‌క్లాసు కంపార్టుమెంటులో జనం ఎక్కువవడంతో ఆమెని పెద్దగా పట్టించుకున్నవాళ్ళు లేరు. పైగా ఓ పెట్టె, బెడ్డింగు ఏవీ లేవుకనుక ఆమె విషయం ఆరారాలేదు. చివరకి ఆమెని

# 20% డిస్కౌంట్ 10 మార్చి నుండి 10 ఏప్రిల్ 1979 వరకు

## ఇది పండుగల మాసం
## అందుకే ఆప్కో వారి 20% ప్రత్యేక రిబేటు మీకోసం

భారత దేశమంతటా విస్తరించివున్న ఆప్కో వారి 375 అమ్మకం కేంద్రాలలో మీరు కొన్న అన్నివస్త్రాలపై 20% ప్రత్యేక రిబేటు పొందండి

మీ కుటుంబానికంతటికీ పనికివచ్చే
మీరు మెచ్చే గద్వాల్,పోచంపల్లి,
గుంటూరు,వెంకటగిరి, ఉప్పాడ,
మాధవరం,ధర్మవరం చీరలు,
ధోవతులు,లుంగీలు.బెడ్‌షీట్లు,
తువ్వాళ్ళు,షర్టింగులు,
కోటింగులు,దోమతెరలు
మొదలైన వస్త్రాలేకాక
మీ అభిరుచులకు తగ్గ
ఎన్నెన్నోరకాల వస్త్రాలు
రడీమేడ్ దుస్తులు
ఆప్కో వారి ప్రత్యేకత.
రంగుల వైవిధ్యానికి
కన్నులకింపైన డిజైన్లకు
నాణ్యానికి, మన్నికకు,ఆధునికతకు
మరో పేరు ఆప్కో వస్త్రాలు.
మీ అందం ఆప్కో వస్త్రాల్లో
మరింత పెరుగుతుంది.
10 తేలిక వాయిదాల్లో చెల్లించే
పద్ధతిపై ఆప్కో వస్త్రాల్ని
రాష్ట్రప్రభుత్వోద్యోగులు
ఇప్పుడు అరువుగా పొందవచ్చు.
జనతా చేనేత చీరలు
ధోవతులుకూడా కంట్రోలు
ధరలకు మావద్ద వున్నాయి.






ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర చేనేత సహకార సంఘం లిమిటెడ్
3-5-115, నారాయణగూడ, హైదరాబాదు, 500029

## ప్రెసిడెంట్ గారి అబ్బాయి

శివశక్తి దుర్గాదేవి మద్రాసు చేరింది. అక్కడి నించీ వెతుక్కుంట అడయార్ లోని మహిళాసభ నర్సింగ్ హోమ్ చేరుకుని అక్కడ చేరిపోయింది నర్స్ ట్రైనింగ్ అవుదామని. ఆమెకా భావం కలిగించిన విజయవాడ పెళ్ళివారిని తలచుకుంటూ.

వాళ్ళు ఏదో మాటల సందర్భంలో అనుకుంటూ వుంటేనే తను శ్రద్ధగా విన్నది. అప్పుడే ఈ ఆంధ్ర ప్రాంతానికి వీడ్కోలు ఇవ్వాలని పూర్తిగా నిర్ణయించుకుంది. కన్న బంధం ఏనాడో దూరమైంది తను జీవించినన్నాళ్ళూ ఒకరికి సాయపడే విధంగా వుందుకు ప్రయత్నించకూడదూ. అనుకున్నప్పుడు ఆమెకి నర్సు ట్రైనింగే చాలా మంచిదని తోచింది. ఆనాడు తను బాబును కనబోయే ముందు మంత్రసాని అన్న మాటలన్నీ చెవుల్లో గింగురుమంటూనే వున్నాయి. తనలాంటి నిర్భాగ్యురాళ్ళు తారసపడితే ఎంతో ఆప్యాయతగా చూసుకోవాలనికూడా నిర్ణయించుకుంది రేపో మాపో వస్తుందనుకున్న పద్మావతి రాకపోవడం పూర్ణానందాన్నేకాదు. ఆ వూరివారినందర్నీ ఆశ్చర్య పరచింది. రోజులు వారాలుగ, వారాలు నెలలుగా గడిచేసరికి అంతా ఆమెని మరచిపోసాగారు. పూర్ణానందమూ సంతోషించాడు. "అసలు జైలునించివచ్చి తన కొడుకుకోసం ఏం రబస చేస్తుందో వాడు చూడబోతే పారి పోయాడు." అని హడలుతున్న పూర్ణానందానికి ఇదొక గొప్ప రిలీఫ్ కలిగించింది.

రెండు సంవత్సరాలు గడిచేసరికి "అసలు వాళ్ళిద్దరూ ఏ రైలుకిందో, ఏ కాలవలోనో పడి చచ్చివుంటారు." అని నిర్ణయించుకుని పూర్తిగా మనసులో ఆనందపడ్డాడు.

శ్రీకాంత్ ఏడవతరగతిలోకి వచ్చాడు. ఆఏడే అదే స్కూల్లో, మేనమామ ఇంట్లో వుండి చదువుకోవడానికి వచ్చిన రామకృష్ణ ప్రసాద్ కూడా ఆరవతరగతిలో చేరాడు.

ఆ రోజు ఆగస్టు పదిహేను. గాంధీజీ మున్సిపల్ హైస్కూల్లో పతాకావిష్కరణ "ప్రెసిడెంట్ శ్రీకాంత్:" అని ఎనౌన్స్‌మెంట్ వినేసరికి షాక్ తిన్న చరవినట యింది రామకృష్ణకు

శ్రీకాంత్; పద్మావతి కొడుకుకాదుగదా: అనిపించింది తల్లి ఆరోజు అతనికి ఎంగిలి అన్నం పెట్టడం, అతను ఇంటినించి పారిపోవడం అతనికి గుర్తున్నంతబాగా శ్రీకాంత్‌కికూడా గుర్తుండి వుండదు

"వందేమాతరం" పాడుతుంటే అంతా లేచినిలబడ్డారు. అతన్నే రెప్పవాల్చకుండా చూడసాగాడు రామకృష్ణ

అప్పుడెలా వున్నాడో ఇప్పుడూ అలాగే వున్నాడు ఎవరు అతని మర్చిపోయినా తను మాత్రం మరచిపోడు స్కూల్లో రెండేళ్ళు కలిపి చదువుకున్నారు.

జండా ఎగురవేశాక ఆ కార్యక్రమమంతా ముగిశాక గేటు బయట కనిపెట్టుకుని వున్నాడు రామకృష్ణ అతన్ని పలకరించాలని అతని మనస్సు తహతహలాడిపోతోంది.

కాసేపటికి వచ్చాడు శ్రీకాంత్:

"శ్రీకాంత్" వాయువేగ మనోవేగాలతో వచ్చిన ఆ పిలుపుకు టక్కున ఆగిపోయి తిరిగి చూశాడు శ్రీకాంత్:

"శ్రీకాంత్ బాగున్నావా? నేను రామకృష్ణని." అంటూ స్నేహపూర్వకంగా నవ్వాడు రామకృష్ణ.

శ్రీకాంత్ నవ్వి "గుర్తువున్నా నన్ను పలకరించద్దు. నువ్వు చాలా గొప్పవాడివి నేను చాలా పేదవాడిని. మనిద్దరిమధ్యా ఇంతకంటే మాటలు వద్దు". అన్నాడు శ్రీకాంత్ ఖచ్చితంగా

ఒక్క క్షణం అతన్నే చూస్తుండిపోయిన రామకృష్ణ. "అలాగే" అంటూ అవతలకి వెళ్ళిపోయాడు.

"ఇతగాడు వెళ్ళి వాళ్ళనాన్నకి చెబుతాడేమో నేను ఇక్కడున్నానని." అని అనుకున్నాడు శ్రీకాంత్:

ఒకవేళ వాళ్ళనాన్నవస్తే తను మాటా, మాటా చెప్పాలి. అని గట్టిగా నిర్ణయించుకున్నాడు కూడా.

తన తల్లి జైలునించి విడుదల అయిందో లేదో తనకి తెలియదు విడుదల అయితే తన ఉనికి పంతులుగారు చెబితే రాక పోతుందా! అని అనుకున్నా అది సందేహంగానే మిగిలిపోయింది శ్రీకాంత్‌కి.

అయితే శ్రీకాంత్ అనుకున్నట్టు రామకృష్ణ ప్రసాద్ తండ్రికి శ్రీకాంత్‌ని గురించి అసలు చెప్పనేలేదు.

శ్రీకాంత్ కనిపించినప్పుడల్లా చిరునవ్వు నవ్వేవాడు రామకృష్ణ. బదులుగా తనూ నవ్వడమే తప్ప ఏనాడూ పెదవి విప్పి మాట్లాడలేదు. మళ్ళీ రామకృష్ణ కూడా మాట్లాడలేదు.

"మీ అమ్మ ఏమయింది?" అని అడగాలని అతనికి మహా తపనగా వుండేది. కాని శ్రీకాంత్ చెప్పడని తెలిసి అడగడానికి సాహసించలేదు

రాను రానూ రామకృష్ణ తనని గురించి ఏమీ చెప్పి వుండడని తట్టాక కాస్త సద్భావం కలిగింది శ్రీకాంత్‌కి



# ముద్దు బిడ్డ మొదటి ఘన ఆహారం.
# ఇందులో సులభంగా జీర్ణమయ్యే బియ్యం, పుష్టికరమైన 11 విటమినులు, మరియు యినుము కలసివున్నాయి

# నెస్టమ్

## బిడ్డలకై తయారు చేయబడిన బియ్యపు సారం.

మీ ముద్దు బిడ్డకు ఘన రూపమైన ఆహారం పెట్టడం ప్రారంభించారంటే, ఆ బిడ్డకు మంచి పుష్టినిచ్చే ఆహారం యివ్వాలి. అంతేకాదు, ఆ ఆహారం అతి సున్నితమైన ఆ బిడ్డ జీర్ణావయవముల మీద తేలికగా పనిచేసేదిగా కూడా వుండాలి. సులభంగా జీర్ణమయ్యే ధాన్య ఆహారం బియ్యమేనని డాక్టర్లు అంగీకరించారు. అందుచేతనే మేము బియ్యంతో నెస్టమ్ క్రీమ్ తయారు చేశాము. ఇందులో మీ బిడ్డ ఆరోగ్యంగా పెరుగుటకు ముఖ్యంగా అవసరమైన విటమినులు, ఇనుము తగినంత పాళ్లలో చేరియున్నది.
మీ ముద్దు బిడ్డకు 3 నెలలు నిండగానే ఘన ఆహారం యివ్వడం ప్రారంభించవచ్చు. బిడ్డ పెరిగే కొద్దీ, ఆ ఆహారానికి పండ్లు, కాయగూరలు, పప్పు, కలిపి, క్రొత్త క్రొత్త రుచులు చవి చూపించవచ్చు మెల్ల మెల్లగా




బిడ్డల జీర్ణ విధానమునకు యెంతో అనువైనది. బిడ్డల పెరుగుదలను బాగా వర్ధిల్లజేసేది.



గరిష్ఠ ధర
రు. 7-00
స్థానిక పన్నులు
అదనం.

**పూర్తి పోషక పదార్థములతో సులభంగా జీర్ణమగు నిండు ఆహారాన్ని తయారు చేయుటకై దీనిని పాలతో కలపండి.**



ముందుగా కాచియుంచిన పాలను వంపుకోండి.



దానికి నెస్టమ్ కలపండి.



వెంటనే యివ్వుటకు తయారు



### ఆరేళ్లు ఇంగ్లాండులో ఉన్న

# డాక్టర్ ఊర్మిళతో ఇంటర్వ్యూ

ప్రశ్న: మీరు ఇంగ్లండు వెళ్లి ఆరేళ్లు అయిందికదా అక్కడ పరిసరాలు, జీవిత విధానాలు ఇక్కడకన్నా మీకు ఏవిధంగా మెరుగ్గా వున్నాయని పించింది?

జవాబు: ఇంటా బయటా కూడా అక్కడ చాలా పరిశుభ్రంగా వుంటుంది. పారిపురుగులు, ఈగలు, బొద్దింకలు, బల్లులు లాంటివి కంటికి కూడా కనిపించవు. రోడ్లపైన దుమ్ము, బురద వుండదు.

ప్ర: ఈ పరిశుభ్రతకు తగిన జాగ్రత్తలన్నీ గవర్నమెంటువారే తీసుకుంటారా? ప్రతి కుటుంబం ఎవరికి వారు తగిన జాగ్రత్తపడతారా?

జ: గవర్నమెంటువారి సదుపాయాలు వుండనేవుంటాయి. కానీ ప్రతి యింట్లో శుభ్రత విషయంలో చాలా శ్రద్ధ చూపిస్తారు. చెత్తాచెదారం జాగ్రత్తగా పారవెయ్యడందగ్గర నుండి, కార్పెట్లు శుభ్రంచేసుకునేవరకూ ప్రతి పనీ స్వయంగా చేసుకుంటారు. బట్టలు వుతకడానికి, అవి ఆరబెట్టటానికి, ఇస్త్రీ చెయ్యటానికి, గదులలో దుమ్ము అంతా పోగుచేసి (సక్ చెయ్యటానికి) ఎత్తటానికి మిషన్లు వుంటాయి. వంట పనిముట్లు కడగటానికి వాషింగ్ మిషన్లు, పాదులు, పిండి రుబ్బటానికి గ్రైండర్లు వుంటాయి. వంటా పెట్టూ కూడా చాలా సులభం. తయారయిన వంటకాలు వేడి చేసుకుని మాత్రం తినేవిధంగా ఎన్నోరకాలు వుంటాయి.

ప్ర: మన దేశంలో గొప్ప, బీద, బిచ్చగాళ్లు ఇలా ఎన్నో అంతస్తుల బేధాలువుంటవికదా, అక్కడ ఆ తారతమ్యాలు కనిపిస్తవా?

జ: అక్కడ నేను బిచ్చగాళ్లను చూడలేదు. మురికివాడలు చూడలేదు. గొప్ప, బీద అన్న భేదాలు కూడా అంతగా కనిపించలేదు. చెత్తా చెదారం పోగుచేసి పారవేసేవాళ్లకి, డాక్టర్లకి, గనులలో పని చేసేవాళ్ళకి ఒకేవిధమైన ఆదాయం వస్తుంది. అందువల్ల వీరందరి జీవితవిధానం ఒకేమాదిరిగా వుంటుంది.

ప్ర: అయితే పనిలేకుండా సోమరితనంగా వుండేవాళ్లు వుండరంటారా?

జ: ఎక్కడో కొందరు వుంటారు. 'డ్రగ్స్'కి దాసులైపోయి, సోమరితనం అలవాటు చేసుకుని, అశుభ్రంగా వుండేవాళ్ళు కొద్దిమంది.

ప్ర: ఇక్కడకూడా చాలామంది మత్తు పానీయాలు తీసుకుంటున్నారుకదా, అవి అక్కడ మరీ ఎక్కువ అంటారు, మీ అభిప్రాయం ఏమిటి?

జ: నిజమే. అక్కడ దాదాపు అందరూ మితంగా డ్రింక్సు తీసుకుంటారు, చలి దేశం కావటంవల్ల డ్రింక్సు కొంత శరీరంలో వేడి పుట్టిస్తాయని. హద్దుమీరి ప్రవర్తించటం అరుదు. స్కాట్‌లాండ్‌లో చంటిపిల్లలకి కూడా పడతారు. స్త్రీలు కూడా డ్రింక్ చేస్తారు. పొగ త్రాగేవారు స్త్రీలలోనే ఎక్కువేమోకూడాను. ఈమధ్య 'డ్రగ్స్' తీసుకోవటం కూడా ఎక్కువ.

ప్ర: పిల్లలు ఎప్పటినుండి త్రాగటం ప్రారంభిస్తారు?

జ: సాధారణంగా పార్టీలకు వెళ్లినపుడు పిల్లలు త్రాగటం నేర్చుకుంటారు. ఆ తరువాత అలవాటుగా తయారవుతుంది.

ప్ర: మన దేశం నుండి వెళ్లిన కుటుంబాలలో స్వేచ్ఛగా బయట అబ్బాయిలూ అమ్మాయిలూ కలసి (డేట్సు చెయ్యటం) తిరగటానికి అనుమతిస్తారా?

జ: మన ఆచార సాంప్రదాయాలకు అలవాటుపడ్డ పెద్దవాళ్లు తమ పిల్లలను అంత స్వేచ్ఛగా తిరగటానికి అనుమతించరు. పన్నెండు సంవత్సరాలదగ్గర నుండీ వారి స్వేచ్ఛను అరికట్ట టానికే ప్రయత్నిస్తారు. కానీ అక్కడ పిల్లల స్వేచ్ఛను చూసి మనవాళ్ల పిల్లలు కూడా అదేవిధంగా తిరగాలని కోరుకుంటారు. ఈ బేధాభిప్రాయాలవల్ల తల్లిదండ్రులకు పిల్లలకు కొంత ఘర్షణ జరుగుతుంటుంది.

ప్ర: పిల్లలకు ఏంతవరకు స్వేచ్ఛ ఇవ్వవచ్చు?

జ: కొంతవరకు ఫరవాలేదు, అది హద్దులు దాటకూడదనే నా అభిప్రాయం.

ప్ర: ఇక్కడ వినోదంకొరకు చాలామంది సినిమాలు చూస్తుంటారు. మీరు సినిమాలకు వెళతారా?

జ: అక్కడ చాలామంది టి. వి. చూస్తారు. కొందరు సినిమాలకూ వెళతారు. కానీ నేను మాత్రం ఈ ఆరుసంవత్సరాలలో రెండు సినిమాలు చూసాను.

ప్ర: ఇక్కడ టి. వి. కూడా చూసారుకదా, అక్కడ టి. వి. కార్యక్రమాలకు ఇక్కడవాటికి తేడా వుందా?

జ: బోలెడంత వుంది. అక్కడ స్థాయి చాలా ఎక్కువ అనిపిస్తుంది. చాలా ఉపయోగకరమైన ప్రోగ్రాములు చూపిస్తారు. డాన్సు పార్టీలకు వెళ్లినవాళ్లుకూడా టి. వి. సమయానికి ఇంటికి రావాలని తాపత్రయపడతారు. అంటే అవి ఎంత బాగుంటాయో మీరు గ్రహించండి.

ప్ర: అక్కడ షాపింగ్ సెంటర్లు యెలా వుంటాయి?

జ: అక్కడ షాపింగ్ చాలా సులభం. అన్ని సామాన్లూ ఒకేచోట దొరికే డిపార్టుమెంటల్ స్టోర్సు అన్నిచోట్లా వుంటాయి. డబ్బు కూడా తీసుకెళ్లకుండా (బేంకర్సు కార్డ్సు) బదులుకు, (మాస్టర్ ఛార్జి కార్డు) హయర్‌పర్చేజ్ పద్ధతిలో కూడా వస్తువులు కొనవచ్చు. అక్కడ ఇంటి ఫర్నిచర్‌కి, కార్పెట్స్ పైన చాలా డబ్బు పెడుతుంటారు. రెండేళ్లకొకమారు ఫర్నిచర్ అంతా మార్చివేస్తుంటారు.

ప్ర: ఇంగ్లండులో భారతీయులు కొందరు షాపులలోనుండి సామానులు తీసుకుపోతుండగా పట్టుబడుతున్నారనీ, వాళ్ళపైన నేరారోపణలు చేస్తున్నారనీ అంటున్నారు,

జ: నన్నడిగారుగనుక నా అభిప్రాయం చెబుతున్నాను. అలాంటివి జరగలేదని, జరగవని నా అభిప్రాయం. నేను ఇంతవరకు వినలేదు.

ప్ర: మన మహిళలలో బంగారంపైన, బంగారు నగలపైన ఎక్కువ మక్కువ వుంటుంది కదా, అక్కడకు వెళ్ళిన తరువాతకూడా వాటిపైన అంత ఇష్టం వుంటుందా?

జ: చాలవరకు తగ్గిపోతుందనే అనిపిస్తుంది, ఇంటిలో కావలసిన వస్తువులకు ఎక్కువగా ఖర్చు పెట్టవలసివుంటుంది గనుక. తోటివాళ్ళ తోటలను, ఇళ్ళనూ చూసి తమ ఇళ్ళు కూడా చక్కగా పెట్టుకోవాలన్న కోరిక ఎక్కువవుతుంది. దానితో నగలపైన పిచ్చి మరీ అంతగా వుండదు.



కుటుంబంతో డాక్టర్ ఊర్మిళ

# ఊర్మిళతో ఇంటర్వ్యూ

ప్ర : మన దేశంలో బాగా చదువుకున్నవారికి, ఒక్కొక్క రంగంలో ప్రావీణ్యం సంపాదించినవారికి కూడా ఉద్యోగాలు దొరకటం దుర్లభంగా వుంది కదా, అక్కడ యీ నిరుద్యోగ సమస్యను ఎలా పరిష్కరించగలుగుతున్నారో చెప్పగలరా ?

జ : ఇక్కడ 10వ క్లాసును అక్కడ ఆర్డినరీ లెవెల్ అంటారు. అంటే సామాన్యమైన చదువులో లెక్క. చాలవరకు అంతటితోటే చదువు ఆపివేసి ఏదో ఒక ఉద్యోగంలో చేరిపోతారు. ఉద్యోగాలు సులభంగానే దొరుకుతవి. ఉద్యోగం దొరికేంత వరకూ బ్రిటిష్ ప్రభుత్వం కొంత డబ్బు ప్రతి వ్యక్తికీ ఇస్తుంది.

ప్ర : అంటే ఏ పనీ చేయకుండా ప్రభుత్వం ప్రతి వ్యక్తికీ కొంత డబ్బు ఇస్తుందంటారా ?

జ : అవును మనకి అది ఆశ్చర్యంగానే కనిపిస్తుంది. అంతమాత్రాన దానికొరకు కాచుకొని వుండరు. ప్రతివారూ పనిచేసి సంపాదించాలనే ప్రయత్నిస్తారు. కొందరు అడ్వాన్సుడ లెవెల్ వరకూ చదువుకుంటారు. కొందరు జి. సి. ఇ. ఎస (జనరల్ కాలేజ్ ఎడ్యుకేషన్) చేస్తారు. కాగానే ఏదోఒక పనిలో ప్రవేశిస్తారు.

కాలానికి వారు ఇచ్చే విలువ చాలా ఎక్కువ. తీరిక సమయం అంటూ ఎక్కువ వుండనేవుండదు.

ప్ర : మీ దంపతులు వైద్య వృత్తిలో వున్నారు కదా, హాస్పిటల్‌లో మాత్రమే పని చేస్తారా, ప్రయివేటుగా కూడా పరీక్షిస్తారా ?

జ : ప్రయివేటుగా **కూడా** చూస్తాము. దానికి ప్రభుత్వం అనుమతి కావాలి. జి. పి. (జనరల్ ప్రాక్టీషనర్సు) అంటారు. ప్రభుత్వం ఒక్కొక్క ప్రాంతంవారిని ఒక్కొక్క జి. పి. వద్దకు వెళ్ళే అనుమతి ఇస్తుంది.

ప్ర : మీ వద్దకు వచ్చిన రోగులవద్ద ఎంత ఫీజు తీసుకుంటారు ?

జ : 18 సంవత్సరాలలోపు విద్యార్థులకు ఉచితం. విశ్వవిద్యాలయాలలో చదివేవారికి చార్జి చేస్తాము. తతిమ్మావారికి ఒక్కొక్క పరీక్షకు 20 పెన్సు (సుమారు రెండు రూపాయలు) అరవై సంవత్సరాలు దాటినవారికి ఉచితం.

ప్ర : అన్ని జబ్బులకూ మీరు చికిత్స చేస్తారా?

జ : కాన్సర్, అల్సర్ లాంటి జబ్బులకు హాస్పిటల్‌లో స్పెషలిస్టులకు రిఫర్ చేస్తాము.

ముసలివాళ్లను, కాన్సర్ పేషంట్సు లాంటి వాళ్లని మేమే ఇంటికి వెళ్లి చూస్తాము. నర్సుని పంపించి వాళ్ళకి స్నానం చేయించటం, బట్టలు వెయ్యటంలాంటి సాయం అందజేస్తారు. స్వచ్ఛంద సేవా సంస్థలు ఇలాంటివాళ్లకు భోజన సదుపాయం **కూడా** చేసే ఏర్పాట్లు చేస్తవి. ప్రభుత్వం ఇలాంటి కార్యక్రమాలకు సాయపడుతుందికూడాను.

ప్ర : ఇక్కడ హాస్పిటల్సులో **కూడా** మీరు పని చేసారుకదా, మీకు తేడా ఏమైనా కనిపిస్తుందా?

జ : మన హాస్పిటల్సుని తీసివేయటంకాదు కానీ పరిశుభ్రతలో చాలా తేడా వుంది. హాస్పిటల్సులో ఇక్కడ నేలపైన ఎన్నో బెడ్సు వేస్తారు. కానీ ఇలాంటిది అక్కడ చూడం. నర్సులు **కూడా** చాలా దయతో రోగులను చూస్తారు. డాక్టర్సులో అక్కడా ఇక్కడాకూడా మేధావులున్నారు. అయితే రోగికి వైద్యం చేసేముందు పూర్తిగా అన్ని పరీక్షలూ చేయనిదే వైద్యం చెయ్యరు.

ప్ర : అక్కడ పుట్టిపెరిగే పిల్లలు చాలా ఆరోగ్యంగా వుంటారు. కారణం ?

జ : గర్భవతులైన స్త్రీలు అక్కడ చాలా జాగ్రత్తలు తీసుకుంటారు. హెల్తు విజిటర్సు ఇంటికి వెళ్లి వాళ్లకు తగిన సలహాలిస్తారు. గర్భవతి కాగానే ఆరోగ్య కేంద్రాలకు గర్భవతి ఆమె భర్త వెళ్లి అన్నీ తెలుసుకుంటారు. బిడ్డ పుట్టే ముందే కాబోయే తల్లి అన్నివిషయాలూ బాగా అవగాహన చేసుకొని సిద్ధంగా వుంటుంది. అందువల్లేకాబోలు ప్రసవ సమయంలో చాలా ధైర్యంగా ఆ నొప్పులను భరిస్తుంది. అది నాకు మొదటలో చాలా ఆశ్చర్యంగా వుండేది ఆశ్చర్యం ఏమిటంటే బిడ్డ పుట్టే సమయంలో బంధువులను లోపలికి రానీయకపోయినా బిడ్డ తండ్రి దగ్గరనే వుండవచ్చు. ధైర్యం చెప్పటానికి భార్య చేయి పట్టుకునేవుంటాడు భర్త.

ప్ర : మీరు సెలవలలో ఎక్కడికైనా వెళుతుంటారా ? వేరే ఏ దేశాలు చూచివచ్చారు ?

జ : సెలవల్లో పిక్‌నిక్స్‌కి వెళుతుంటాము. టూరింగ్ ఏరియాస్‌లో బి. బి. అని ఉదయం బ్రేక్‌ఫాస్టు, పడకకు సదుపాయం వుంటుంది. ఆవిధమైన సదుపాయం అమెరికాలో కనిపించలేదు. స్కాట్‌లెండ్, వేల్సు వెళ్లాము. కొండలు, కొలనులు యెంతో అందంగా వున్నవి.

ప్ర : అక్కడ మీరు ఇప్పటి రచయితలను, రచయిత్రులను కలుసుకున్నారా? పూర్వ రచయితల జన్మస్థలాలుగానీ వెళ్లి చూసారా ?

జ : రచయితలతో, రచయిత్రులతో నాకు అంతగా పరిచయంలేదుకానీ షేక్స్‌పియర్ పుట్టినచోటు 'స్టఫోర్డ్ అపాన్ అవాన్'కి వెళ్లాము. ఆయన బ్రతికివున్నప్పుడు వుపయోగించిన వస్తువులన్నీ అదేవిధంగా వుంచారు ఎవాన్ నది ఒడ్డున ఒక థియేటర్ కట్టారు. షేక్స్‌పియర్ వ్రాసిన నాటికలు అందులో ప్రదర్శిస్తారు.

ప్ర : అక్కడ మీరు ఏ నాటిక చూసారు ?

జ : 'మెజర్ టు మెజర్' అన్న డ్రామా చూసాము. ఎంతోబాగుంది. చాలా సహజంగావుంది.

ప్ర : మీకు ఇంగ్లండులో అన్నిటికన్నా నచ్చినది ఏమిటో చెబుతారా ?

జ : కంట్రీసైడ్. దారి ఇరుప్రక్కలా ఒక పిక్‌నిక్ స్పాట్‌లా వుంటుంది.

ప్ర : అక్కడే వుండిపోవాలనివుందా మీకు ?

జ : అది మాత్రం ఎన్నటికీ జరగదు. తప్పక మన దేశం తిరిగి వచ్చేస్తాం.

– లక్ష్మీరమణ ★

# జీవిత  మాధుర్యం

సీరియల్

యర్రగుంట్ల వరలక్ష్మీదేవి

"లేడీస్ అండ్ జంటిల్‌మన్. ఇన్నాళ్ళు మన క్లబ్బు కార్యకలాపాలు కొంత డల్‌గానే జరిగాయి. దానికి కారణం పురుషులుకారు, స్త్రీలే. వాళ్ళలో చురుకుదనం, ఉల్లాసం కొంత లోపించింది. ఆమధ్యన ఒక ఎక్స్‌పర్ట్ కమిటీని పెట్టి పరిశోధన జరుపగా తేలిందేమంటే నోబెడ్ ఇండస్ట్రియలిస్ట్ అండ్ హాండ్‌సమ్ యూత్ అయిన వినోదమూర్తి క్లబ్బుకి గత ఆరునెలలుగా రాకపోవడమేనని. మనల్నందర్నీ నిరాశ, దిగులుపాలు చేయకుండా వుండేటట్లు అతడ్ని రమ్మని కోరడానికి ఒక డెప్యుటేషను పంపించేము. కాని అతను ఈ నగరంలో లేడని అతని జాడ ఎవ్వరికీ తెలియదని, విని మరింత నిరుత్సాహపడిపోయేము. ముఖ్యంగా లేడీస్ విడిచే ఆ వేడినిట్టూర్పులకు ఈ ఎయిర్ కండిషన్డు హాలు కూడ చల్లదనాన్ని కోల్పోయింది.

మనందరి కోరికను తెల్సుకుని ఎంత చల్లగా జారుకున్నారో అంత మెల్లగా మనమధ్యకు వచ్చిన వినోదమూర్తిని ఆనందంతో ఆహ్వానించడం మన విధి. ఆ సంకల్పంతో మొదటిరౌండు డ్రింక్సును నేనిస్తున్నాను. ఈమధ్యనే ఇటలీ నుండి ఒక కేసు జిన్ వచ్చింది. ఆ జిన్ అందర్కీ సెర్వు చేయిస్తున్నాను. నసెప్టబిల్ లేడీస్ కావలిస్తే ఏపిల్‌జ్యూస్ తీసుకోవచ్చు."

"థాంకుయు — థాంకుయు. మన సెక్రటరి సారథి ఉత్సాహం మెచ్చుకోదగింది," అని చాలామంది పలువిధాల ప్రశంసించేరు.

ఒకరిద్దరు స్త్రీలు తప్ప అందరూ జిన్ పుచ్చుకున్నారు.

"ఛీర్స్ టు సారథి అండ్ వినోద్!" అన్న ఉత్సాహ భరితమైన కేకలతో హాలు మారుమ్రోగింది. ఆ క్లబ్బు వినోద్ రాకతో కొత్త ఉల్లాసాన్ని పొందింది.

అప్పుడే వచ్చిన అశోక్ కూడ ఒక గ్లాసు అందుకుని వినోద్ గ్లాసుకు, అరుణ గ్లాసుకు తగిలించి ఛీర్స్ చెప్పేడు.

కాస్సేపయేక వినోదమూర్తి రెండోరౌండు డ్రింక్సు తన తరపున తెప్పించేడు.

జ్యోత్స్న, కౌసెల్, రీనాబోస్, రోజీ, అహల్య వినోద్ చుట్టూ మూగేరు. వినోద్ ఆనందంగా వాళ్ళతో కబుర్లలో పడ్డాడు. మిగతా యువకులకు సుధాకర్, ఫణి, రాజు, కాశీనాథం, అశోక్‌కి కాస్త అసూయ కల్గింది. రాజు వుండబట్టలేక — "వినోద్ వచ్చేడు, చక్కని అమ్మాయిలందర్నీ తనవైపుకు తిప్పుకున్నాడు. అతడెప్పుడూ అదృష్టవంతుడే!" అని దిగులుపడ్డాడు.

*(గత సంచిక తరువాయి)*

ఈలోగా బ్యాండు వచ్చింది. డ్యాన్సు మొదలైంది వినోద్‌తో మొదటి డ్యాన్సు అరుణాదేవి చేసింది. రెండవసారి డ్యాన్సుకు అశోక్ అరుణాదేవిని మెల్లగా వినోద్ చేతుల్లోంచి తప్పించి తన చేతులలోకి తీసుకున్నాడు. వినోద్ ఆ డ్యాన్సు రోజీతో చేసేడు. అలా కొంతసేపు గడిచేక కబుర్లలో పడ్డాడు ఇంతలో తొమ్మిదిగంటలైంది. కొందరు తమ కార్లలో ఇళ్ళకు పోయేరు. మిగిలినవారు క్లబ్బులోనే డిన్నర్ తీసుకుందుకు సంసిద్ధులయేరు. అశోక్, వినోద్, అరుణ ఒక టేబిలు వద్ద కూర్చుని డిన్నరు తీసుకున్నారు. ఆనాడు అరుణ అందంతో మెరసిపోతూంది. అశోక్ చూపు, మనస్సు అరుణమీదే. వినోద్ ఇది గమనించి మెల్లగా తనలోనే నవ్వుకున్నాడు. ఆ సమయంలో వినోద్‌కి లావణ్య జ్ఞప్తికివచ్చి మనస్సులో చిన్న ముల్లు గుచ్చుకున్నట్లయింది. వెంటనే అతడి చిరునవ్వు మాయమైంది. ఒక్కసారి ఆర్పేసిన దీపంలా అయింది అతడి ముఖం. అరుణ తల యెత్తి వినోద్ ముఖంలోకి చూసి ఆందోళనతో — "ఏమైంది వినోద్! ఇంతలో ఇలా అయిపోయేవు?" అడిగింది.

"ఏమీలేదు. చాలాకాలమైంది డ్రింకు తీసుకుని — ఈ ఉత్సాహంలో రెండు గ్లాసులు పుచ్చుకోడంవల్ల చిన్న హెడ్‌ఏక్ వచ్చింది. పరవాలేదు అదే పోతుందిలే," అని లేని ఉత్సాహం తెచ్చుకుని చిరునవ్వుతో సర్దిచెప్పేడు.

డిన్నర్ అయిపోయిన తరువాత మళ్ళీ ఫ్రెండ్సుతో ముచ్చటలాడేరు.

అరుణాదేవి, వినోద్ మళ్ళీ వచ్చినందుకు ఆనందసూచకంగా తమకు సన్నిహితంగానున్న స్నేహితుల్ని ఓ ఇరవైమందిని ఆ వారాంతంలో తన ఇంట్లో జరగనున్న పార్టీకి ఆహ్వానించింది. అందరూ ఆనందంతో ఆహ్వానాన్ని అంగీకరించేరు. ఇంతలో మిసెస్ అరుంధతి వినోద్ వద్దకు వచ్చి— "హలో డియర్! మరి మీరు, అరుణ యెప్పుడు వివాహం చేసుకుంటున్నారో ఆ పార్టీలో ఆ డేట్ అనౌన్స్ చేస్తారా," అని కుతూహలంగా అడిగింది. వినోద్ నవ్వేసేడు —

"అరుంధతిగారూ! నా పెండ్లికి ముహూర్తం కుదరగానే తప్పక తెలియజేస్తాను. అంతవరకు ఓపికగా వేచివుండాలిమరి."

అరుంధతి అదోలా చూసింది.

వినోద్ ఇంటికి చేరేసరికి రాత్రి పదిన్నర అయింది.

## 15

"చూడమ్మా లావణ్యా! నువ్వు పొరబడ్డావు. వినోద్ అలాంటివాడుకాదు. అబ్బాయి మనస్సు నిర్మలమైంది. అందులో మోసమన్నదిలేదు. అతడు ఎంతో వున్నతుడు. నువ్వు చాలా తొందరపడ్డావమ్మా."

"లేదమ్మా — నేను ఆ మరదలు అరుణ వ్రాసిన ఉత్తరం చదివేను. అతడికి ఎందరో గర్ల్ ఫ్రెండ్సున్నారు. అతడి హైక్లాసు సొసయిటీలో ఇట్లాంటి స్నేహాలు, ప్రణయాలు మామూలు విషయాలనుకుంటా. అతడో స్వేచ్ఛాజీవి. అతడు ఆ మరదల్ని పెండ్లి చేసుకోబోతున్నాడు. అతడు వ్రాస్తున్న ఉత్తరం చదివేను. అతడు పిరి

***జరిగిన కథ - 11 :*** బ్రతికిచెడ్డ భూషణం కుటుంబం చేసుకోబోయిన ఆత్మహత్యా ప్రయత్నం వినోదమూర్తి రాకవల్ల విఫలమవుతుంది. వాళ్లను ఆదుకొనటానికి తోటను కౌలుకు తీసుకొని కొన్నాళ్ళు అక్కడే వుండాలనుకుంటాడు వినోదమూర్తి. లోగడ ఆస్తిలో తన వాటా తీసుకొని దుర్వ్యసనాలకు లోనై, సినీతార తిలోత్తమ వ్యామోహంలో పడతాడు భూషణం తమ్ముడు చక్రవర్తి. ఆస్తి అంతా హరించగా భార్య నిరాదరణతో కృశించి మరణిస్తాడు. వ్యాపారంలో కలిసిరాక భూషణం అప్పులపాలవుతాడు. కౌలుకి తీసుకున్న స్థలంలో కొంతమేర కూరగాయలకు కేటాయించి, మిగిలిన స్థలంలో పౌల్ట్రీ పెట్టడానికి ప్రయత్నాలు చేస్తుంటాడు వినోదమూర్తి. 'విశాలా వెజిటబుల్ ఫారం', 'సుకుమార్ ఇండస్ట్రీస్'ల ప్రారంభోత్సవ సన్నాహాలతోపాటు; వినోదమూర్తి, లావణ్యల మధ్య ప్రేమ వికసిస్తుంటుంది. వారి ప్రేమ ఏ విధంగా పరిణమిస్తుందోనని భూషణం దంపతులు ఆందోళన చెందుతారు. ఇరువురి కుటుంబ విషయాలూ పరస్పరం తెలుసుకున్న అనంతరం వినోద్ లావణ్యను పెండ్లి చేసుకుంటానని మాట యిస్తాడు. ఈలోగా ఇంటినుండి వచ్చిన ఉత్తరాలను అందుకుంటాడు. లోగడ ఇచ్చిన అప్పును తనద్వారా వసూలుచేయ ప్రయత్నించిన మదన్‌లాల్‌ను అతను మందలిస్తాడు. అప్పు తీర్చి తనఖా దస్తావేజులు తీసుకొని, మేనమామ కూతురు అరుణ వ్రాసిన ఉత్తరం చూచిన లావణ్య తనని నిందించగా వినోద్ తన యింటికి వెళ్ళిపోతాడు. తమ్ముడు అశోక్‌పట్ల అరుణ విముఖముగా ఉన్నదని తెలుసుకొని, పాత స్నేహితులను కలవటానికి క్లబ్బుకు వెళ్తాడు వినోద్.

ఎలుకల్తో ఆడినట్లు నాతో నాటకం ఆడేడమ్మా- నేను మోసపోయేనమ్మా,'' అని సన్నగా ఏడవడం మొదలెట్టింది.

విశాలాక్షి ఆందోళనగా ''మోసపోయే నంటే?'' అని అడిగింది

''మరేమీ విపరీత అర్థం తీసుకోకమ్మా. ఆ విషయంలో నా మనోనిబ్బరం నాకెప్పుడూ వుందమ్మా.''

## జీవిత మాధుర్యం

''బ్రతికించేవు -- నువ్వేమి చెప్పినా నాకు వినోద్ మీద నమ్మకం పోవడంలేదు. అతడు చాలా గౌరవాభిమానాలు గల యువకుడని నా విశ్వాసం. మేము వచ్చేవరకు నువ్వు తొందరపడకుండా వుండవలసింది. నేనేనా, మీ నాన్నగారేనా అతడి మనస్సులోని మాటను తెల్సుకొనుందుము. నీకు ఆలోచన తక్కువ, ఆవేశం ఎక్కువ. అందుకే ఆ అబ్బాయిని తొందరపాటుతో పొమ్మన్నావు. అభిమానం కలవాడుకదా, ఇప్పుడు ప్రాధేయపడినా తిరిగి మనింటికి వస్తాడా ఆలోచించు.''

''అయితే నేను చదివినదంతా అర్థంలేనిదంటావా? నువ్వే చూద్దువుగాని అతడు ఆ మరదల్ని వివాహం చేసుకుని మనకో శుభలేఖ వ్రాసి పడేస్తాడు.''

---

''మీ నాన్నగారిక్కీ, నాకు ఆ అబ్బాయిమీద ఎంతో విశ్వాసం. ఒకవేళ ఆ భగవంతుడే నీకు ఆ అబ్బాయిని కాకుండా చేసేడంటే, అది మన ఖర్మ అనుకోవడం తప్ప చేసేదేమిలేదు. మనం వినోద్‌ని నిలబెట్టి అడగడానికి మనకు హక్కు ఏదీ ? లావణ్యా ! నీ మనస్సును సమాధానపర్చుకో విధి వ్రాత ఎలా వుంటే అలా జరుగుతుంది.''

ఆ సాయంత్రం లావణ్య గులాబీ తోటలో తిరుగుతుంటే విశాలాక్షిని అడిగేడు భూషణం — ''ఏమైంది విశాలా ? వివరం కనుక్కున్నావా ?''

''ఏముంది — వినోద్‌కి మేనత్త కూతురు అరుణ అనే అమ్మాయి వుందట హైదరాబాదులో. అబ్బాయికి మేనరికం చేద్దామని ఓ ఆలోచన వుందట. ఆ అమ్మాయి అరుణ ప్రేమతో వినోద్‌కి ఉత్తరం వ్రాసిందట. అందులో ఎవరెవరో ఆడపిల్లలు వినోద్ కోసం పరితపిస్తున్నారని ఆ అరుణ వ్రాసింది. ఫోటో కూడా పంపింది. ఆ పిల్ల అందమైనది. లావణ్య ఆ ఉత్తరం చదివి ఆ బాధలో, ఆ ఆవేశంలో వినోద్‌ని నానామాటలూ అని ఇంట్లోంచి పొమ్మంది. అతడు కోపంతో వెళ్ళిపోయేడు. ఇదీ సంగతి. లావణ్య తొందరబాటు తనానికి నేను చీవాట్లుపెట్టేనులెండి — మీరేమీ అమ్మాయిని అనకండి. చూసేరా తొందరపడి అనాలోచితంగా పొమ్మందిగాని దాని మనస్సంతా వినోద్ పైనే. అతడు జ్ఞాపకానికి వచ్చినప్పుడల్లా ఆ తోటలో పిచ్చిదానిలా అలా తిరుగుతుంది. దాని బాధను మనం అర్థంచేసుకోవాలి.''

''అది సరేగాని అతడు మన గురించి ఏమనుకుంటున్నాడో! చావడానికి సిద్ధంగానున్న మనుష్యులను రక్షించి మళ్ళీ మామూలుగా, గౌరవంగా బ్రతికేటట్లు చేసినా అట్లాంటిది నన్నే ఇంటినుండి పొమ్మన్నారే — అనుకోడూ ? ఇప్పుడు మనకున్న ఈ ఫారమ్, ఈ ఫౌండ్రీ అతడు ఇచ్చినవేకదా. మన గౌరవంకోసం మనం పార్టనర్సు అన్నాడుగాని, మనకున్నదేమిటి ఎదుపెట్టడానికి. ఉన్నవన్నీ అప్పులేగా. అట్లాంటిది మనం ఏమాత్రం కృతజ్ఞత చూపకుండా ఇంట్లోనుండి పొమ్మన్నాం అంటే అతడు యెంత బాధపడ్డాడో! ఇంత ఆవేశం లావణ్యకు తగదు విశాలా. తను బాధపడవచ్చు కాదనను — కాని మనం వచ్చేవరకు ఆగి మనతో ఆ విషయం చెప్పొచ్చుగా. మనం అతణ్నే తగురీతిలో అడిగుందుము.''

''చూడండి అమ్మాయి వినోద్‌ని ప్రేమించింది. ప్రేమకు, కృతజ్ఞతకు ఎట్టి సంబంధములేదు. వినోద్ స్వభావాన్ని మెచ్చుకోగల్గినప్పుడు వినోదంటే ఆదరణ కల్గవచ్చు. కాని ప్రేమ వేరు. ఆ ప్రేమ బూటకమైపోయిందని అనుమానం కల్గగానే తప్పక వ్యక్తిత్వం గల ఏ స్త్రీకైనా ఆవేశం, ఆక్రోశం కల్గుతుంది. లావణ్య విషయంలోకూడ అదే జరిగింది. అందుచేత లావణ్యను మనమిప్పుడు ఏమన్నా దానికి మరింత బాధను కల్గించినవాళ్ళమౌతాము. లేదూ అతడు నిజంగా మనల్నందర్ని మరచిపోయి హైదరాబాదులోనే వుండిపోయి ఆ మరదలు అరుణను వివాహం చేసుకున్నాడంటే మనం చేయగల్గింది ఏమీలేదు. మెల్లగా మనం లావణ్య మనస్సును మార్చాలి. అదిగో సుకుమార్ వస్తున్నాడు వాడికి ఈ విషయం ఎంతవరకు తెల్సునో.''

''అబ్బాయి సుకుమార్ ఇలా రా. ఏమయింది వినోద్ వెళ్ళిపోయేడు ?''

సుకుమార్ కోపంగా — ''అక్కనే అడగండి. ఆవిడగారే అతడ్ని తరిమేసింది.''

''కోపం తెచ్చుకోకు నాయనా — ఏం జరిగిందో నీకు తెల్సింది చెప్పు.''

''నేను ఫౌండ్రీలో వుండగా హఠాత్తుగా తన రెండు పెట్టెలను తీసుకుని వినోదమూర్తిగారు వచ్చేరు. తను అర్జెంటుగా హైదరాబాదు వెళ్ళవలసివచ్చిందని, మళ్ళీ ఎన్నాళ్ళలో వస్తారో తెలియదని చెప్పేరు. ఇక్కడ వ్యవహారాల్ని తనకు అప్పుడప్పుడు తెల్పుతూవుండమని, డబ్బుకు అవుసరమైతే తనకు వ్రాయమని నాకు తన హైదరాబాదు ఇంటి అడ్రసు ఇచ్చి తన నమస్కారాల్ని మీరిద్దరికి చెప్పమని కోరి వెళ్ళిపోయేరు. వినోద్‌గారు తన మోటారు సైకిలుని తనకు మరి అవుసరంలేదని నాకిచ్చేసేరు.

అతను టాక్సీలో రైల్వేస్టేషను వెళ్ళిపోతున్నప్పుడు లావణ్యక్క గుమ్మంవరకైనా రాలేదు. నాకు అనుమానం వచ్చి మేడమీదకుపోయి చూద్దునుకద, అక్కయ్య తన గదిలో ఏడుస్తూంది. నేనడుగుతే దేముడులాంటి వినోద్‌గారిని మోసగాడని ఏవేవో చెప్పింది — కాని వాటిని నమ్మలేను. ఇంతే జరిగిందానాడు.''

సంగతంతా తెల్సింతరువాత విశాలాక్షి, భూషణం ఏమీ చేయలేక నిరుత్సాహంతో నిట్టూర్చి ఊరుకున్నారు.

రోజులు సాఫీగా సాగిపోతున్నాయి. ఆలోచనలకు తావులేక భూషణం, సుకుమార్ రోజంతా ఆ వెజిటబుల్ ఫారమ్‌లోను, ఆ ఫౌండ్రీలోను ఉత్సాహంగా పని చేసేవారు. లావణ్యకు ఏ పని చేస్తున్నా తలపులన్నీ వినోద్ పైకే పోయి బాధను కలిగించేవి. ఆమె ఎంత మరచిపోదామన్నా మనస్సు వినిపించుకోడంలేదు. వినోద్ చిరునవ్వులు, అతడి కౌగిలిలోని వెచ్చదనం, అతడి ముద్దులలోని

[ 32వ పేజీ చూడండి ]





'చెయ్యెత్తి జై కొట్టు'లో గీత, కృష్ణంరాజు

## మాట తప్పని మనిషి అంకయ్యగౌడ్

గూడూరు వాస్తవ్యులైన శ్రీ రావుల అంకయ్యగౌడ్ ఎంత సింపుల్‌గా వుంటారో, మాట ఇస్తే, అంత కరెక్ట్‌గా వుంటారు. రెండు మాటలు మాట్లాడడం అంటే మహా చిరాకు అంకయ్యగారికి. వెరైటీ చిత్రాలను నిర్మించాలనేదే వారి అభిమతం. "రామా గెలుపు నీదే" చిత్రాన్ని అమ్మివేసినప్పటికీ, తన స్వయం ఖర్చులతో ఆ చిత్రానికి బోలెడంత పబ్లిసిటీ చేశారన్న ఘనత దక్కింది అంకయ్యగౌడ్‌గారికి. "ఒక్క మాట, అదీ ఒకేసారి" అనేదే వీరి పాలసీ. అందుకే అంకయ్యగారంటే అందరికీ ఇష్టం. వారితో వ్యాపారం అంటే వుత్సాహం.

## ఫారిన్‌లో చిత్ర నిర్మాణం

ఈ సంవత్సరం "మే" నుంచి శ్రీ బాలచందర్ దర్శకత్వంలో ప్రేమాలయ వారు లండన్‌లో నిర్మించబోయే చిత్రాన్ని కూడా తాను తీసుకోవాలనుకుంటున్నట్టు, అందుకు వలసిన పాస్‌పోర్ట్ కూడా తనదగ్గర వున్నట్టు వెల్లడించారు శ్రీ అంకయ్యగౌడ్. "సంవత్సరానికి రెండు వెరైటీ చిత్రాలను అందించాలనేదే నా ఆశ. ఒకటి దేవర్ ఫిలింస్‌వాళ్ల చిత్రం, మరొకటి బాలచందర్ గారి చిత్రం" అన్నారు శ్రీ అంకయ్యగౌడ్.



## నైరోబిలో చేయలేదు ఎందుకని ?

దేవర్ ఫిలిమ్స్ హిందీ "మా" ఆధారంగా తెలుగులో నిర్మిస్తున్న "అమ్మ ఎవరికైనా అమ్మ" వర్ణ చిత్రం (మార్చిలో జరిగిన 12 రోజుల షూటింగ్‌తో) మొదటి షెడ్యూల్ పూర్తయింది. ఖరీదైన ఒక భవనాన్ని సత్యా స్టుడియోలో సృష్టించి, ఆ భవనంలో రజనీకాంత్, శ్రీప్రియ, మోహన్‌బాబు, జయమాలిని, అంజలీదేవి, నాగభూషణం ప్రభృతులు పాల్గొన్న పెక్కు సన్నివేశాలను చిత్రీకరించారు దర్శకుడు శ్రీ ఆర్. త్యాగరాజన్. 3½ లక్షలు వెచ్చించి వేసిన ఈ సెట్టింగ్స్ నయనానందకరంగా వుండడమేకాదు, బోలెడన్ని సినిమాలు తీసుకునేందుకు వీలుగా వున్నాయి. అంత అందంగా, అధునాతనంగా నిర్మించబడింది ఆ సెట్.

"అమ్మ ఎవరికైనా అమ్మ" చిత్రం అవుట్‌డోర్ షెడ్యూలును నైరోబిలో ప్లాన్ చేసారు దేవర్ ఫిలిమ్స్. కానీ ఇపుడు మదుమలైలో చేస్తున్నారు. దీనికి కారణం ఏమిటని దర్శకుడు శ్రీ త్యాగరాజన్ను అడిగితే, వారు చెప్పిన సమాధానం సమంజసంగానే వుందనిపించింది. "నైరోబిలో చేయాలనే కొండంత ఆశతో వున్నాము మేము. అందుకు ఎంతో ప్రయత్నం చేసాముకూడా. కానీ మాకు కావలసిన వసతులన్నీ అక్కడ సమకూరడం కొంత సమస్యగా పరిణమించడంతో మా నిర్ణయాన్ని మార్చుకోవాల్సివచ్చింది. మా యూనిట్ అక్కడ కొంతకాలం వుండడానికి తగిన సౌకర్యాలను ఎవరైనా చేయగలిగితే ఇప్పుడు కూడా మేము సిద్ధమే నైరోబిలో షూటింగ్ చేయడానికి" అన్నారు శ్రీ త్యాగరాజన్, నిర్మాత శ్రీ దండాయుధపాణి.

డబ్బు పోతే తిరిగి సంపాదించుకోవచ్చు. కీర్తి పోతే మళ్లీ పొందవచ్చు. ప్రపంచంలో ఏ వస్తువునైనా ధనంతో కొనొచ్చు. కానీ జన్మనిచ్చిన తల్లి పోతే మళ్లీ తిరిగిరాదు. ఎంత డబ్బిచ్చినా, ఎన్ని ప్రయత్నాలు చేసినా, ఆ మాతృప్రేమను మళ్లీ పొందడం అసంభవం. "అమ్మ" అనే అపురూపమైన స్థానానికి మానవజాతిలోనే కాదు, జంతుకోటిలోకూడా బోలెడంత ప్రాముఖ్యత వుంది. ఆ తల్లీబిడ్డల ప్రేమానురాగాలు ఎంత బలమైనవో, అంత విలువైనవికూడా. "అమ్మ" అనే రెండక్షరాల్లోనే అనంతమైన ఈ జగత్తు దాగుంది. ఆమె లాలనలోనే ఈ జీవకోటి పయనిస్తోంది. ఆమె ప్రేరేపణతోనే జీవిస్తోంది. అందుకే "అమ్మ ఎవరికైనా అమ్మ". తన బిడ్డడు దుష్టుడైనా, దుర్మార్గుడైనా, ఆ తల్లికి అతను పిల్లాడే. అలాగే జంతువులు క్రూరమైనవైనా, వాటి పిల్లలంటే వాటికి ప్రాణం. ఆ పిల్లలకు తమ తల్లి అంటే అభిమానం. ఈ విషయాలను వివరిస్తూ నిర్మింపబడుతున్న చిత్రమే "అమ్మ ఎవరికైనా అమ్మ".

శ్రీ రావుల అంకయ్యగౌడ్ వరల్డ్ నెగటివ్ రైట్స్ పొందివున్న ఈ చిత్రానికి శ్రీ ఆత్రేయ మాట, పాటలను, శ్రీ ఇళయరాజా సంగీతాన్ని, శ్రీ రామ్మూర్తి కెమెరాను, శ్రీ బాలు కూర్పును, శ్రీ ఘంటసాల చిరంజీవి సహకార దర్శకత్వమును సమకూరుస్తున్నారు.

శ్రీ చిత్తూరు ఆనందనాయుడు నిర్వహణలో తయారయ్యే ఈ చిత్రంలో రజనీకాంత్, శ్రీప్రియ, మోహన్‌బాబు, జయమాలిని, నాగభూషణం, అంజలీదేవి, అల్లు రామలింగయ్య, రమాప్రభ, కె. వి. చలం ముఖ్య తారాగణం.

## శివకామేశ్వరీలో మోహన్ సుధ

లక్ష్మి ఫిలింస్ కంబైన్స్ నిర్మాతలకు ఆత్మీయుడు, పరిశ్రమలో అందరికి పరిచయస్తుడు అయిన శ్రీ బాబీ స్వతంత్రంగా ఒక చిత్రాన్ని తలపెట్టిన వార్త పాఠకులకు తెలుసు.

శివకామేశ్వరీ ప్రొడక్షన్స్ సంస్థ పేరిట, శ్రీ విజయకుమార్ నిర్మిస్తున్న కొత్తతరహా సాంఘిక చిత్రానికి "రేపటి అమ్మాయి" అని పేరు పెట్టారు.

శ్రీ విక్టరీ మధుసూదనరావు దర్శకత్వంలో రూపొందనున్న ఈ చిత్రానికి బొల్లిముంత శివరామకృష్ణయ్య మాటలను, జి. కె. వెంకటేష్ సంగీతాన్ని సమకూరుస్తున్నారు.

ఆగస్టు 1 నుంచి 13 వరకు తొలి షెడ్యూలు, సెప్టెంబరు 17 నుంచి 30 వరకు రెండవ షెడ్యూలు జరగడానికి వీలుగా జయసుధ, మురళీమోహన్, మోహన్‌బాబుగార్లు కాల్‌షీట్లు యిచ్చారు

జులైలో పాటల రికార్డింగు పూర్తవుతుందని, కథకుడు శ్రీ బాబీ తెలిపారు.

## ఆరుగురితో అగ్రదర్శకుడు

హీరోలు ఎంత బిజీగా వుంటారో ... వాళ్లకంటె బిజీగా వుండే దర్శకుడు ఒకరున్నారు. ఆయన జనమెరిగిన ప్రతిభావంతుడు. పేరు దాసరి.

1979లో ఒక్క రోజు కూడా ఖాళీ లేదు, సరికదా... వచ్చే సంవత్సరానికి కూడా శ్రీ దాసరి డేట్స్ యిచ్చేశారు.

విజయమాధవీ పిక్చర్స్‌వారి "రంగూన్ రౌడీ" రంగుల చిత్రం వాహినీ ఎనిమిదవ ఫ్లోర్‌లో జరుగుతున్న సమయాన... శ్రీ దాసరి ఒక విశేష వార్త చెప్పారు.

ఈ సంవత్సరంలో ఆరుగురు నటిస్తున్న చిత్రాలకు, శ్రీ దాసరి దర్శకత్వం వహిస్తున్నారు.

శ్రీ అక్కినేని నటిస్తున్న ఏ. ఏ. కంబైన్స్ నవలా చిత్రం, లక్ష్మి ఫిలింస్ కంబైన్స్ కొత్త చిత్రం,

శ్రీ నందమూరి నటిస్తున్న కె. సి. ఫిలింస్ కొత్త చిత్రం,

శ్రీ శోభన్ నటిస్తున్న యువచిత్ర, శైలజ ఎంటర్ ప్రైజస్ చిత్రం, శ్రీ కృష్ణంరాజు నటిస్తున్న విజయమాధవీ పిక్చర్స్, శ్రీ మురళీమోహన్ నటిస్తున్న అన్నపూర్ణా స్టుడియోస్ చిత్రం.

## తెలుగు ప్రేక్షకులకు తెలుగు చిత్ర అందించే అపూర్వ కానుక

"కొత్తదనం కావాలి... రావాలి" అని లక్షలాది ప్రేక్షకులు కోరుతున్నారు. నిజమే అని పరిశ్రమ వ్యక్తులు అంగీకరిస్తున్నారు. కానీ, చెయ్యడానికి జంకుతున్నారు. అలాంటి తరుణంలో "మేము తీస్తాము" అని తెలుగు చిత్ర అధినేతలు ధైర్యాన్ని ప్రదర్శించి... అగ్రదర్శకుడు శ్రీ దాసరి చిత్రీకరణలో "నీడ" అనెడి సాంఘిక ప్రయోజనం గల చిత్రాన్ని, విజయవాడలో ప్రారంభించారు.



'ఏడడుగుల అనుబంధం'లో
నారాయణరావు, జయసుధ

"పెద్దల అడుగుజాడలలో నడిచే పిల్లల భవిష్యత్తు గురించి ఆలోచించవలసిన బాధ్యత పెద్దలిదే అన్న అంశం యితివృత్తం", అన్నారు ప్రజాదర్శకుడు శ్రీ దాసరి.

ఈ చిత్రానికి హీరో కృష్ణగారి కుమారుడు చిరంజీవి రమేష్ కథానాయకుడు. మరో ముఖ్య భూమికను బాబీ (విజయకుమార్) పోషిస్తున్నారు.

తారాగణం : అందరూ కొత్తవారే, సంగీతం : రమేష్‌నాయుడు, నిర్మాత : రామినేని, కెమరా : కె. ఎస్. మణి, ఆర్ట్ : భాస్కరరాజు, ప్రొడక్షన్ : రమణరావు, అసోషియేట్ : కోడి రామకృష్ణ.

## గోపీనాథ్ కథకు కె. యస్. రెడ్డి దర్శకత్వం

యం. యస్. గోపీనాథ్ వ్రాసిన కథకు "మనిషి—మృగము" అని పేరుపెట్టి కమల్ చిత్ర మూవీస్ బ్యానరుపై డైరెక్ట్ చేస్తున్నారు కె. యస్. రెడ్డి. నోరున్న మనుషులకన్నా, నోరు లేని ఆటవిక జంతువులే విశ్వాసపాత్రమైనవి అని చాటిచెప్పే ఇతివృత్తమే "మనిషి – మృగము" వర్ణ చిత్రం.

సాత్‌నూర్‌లో జనవరి 24న ప్రారంభమైన ఈ చిత్రం షూటింగ్ కొంత భాగం పూర్తయింది. జగ్గయ్య, జమున, కవిత, నరసింహరాజు, గిరిబాబు, గోపీనాథ్, కె. వి. చలం, సుంకర లక్ష్మి ముఖ్య పాత్రలను పోషిస్తున్న ఈ చిత్రానికి కృష్ణమోహన్, గోపీనాథ్ మాటలను, సత్యం సంగీతాన్ని, బి. యస్. హరిదాస్ కెమెరాను, కందస్వామి కూర్పును, యస్. పి. రంగారావు సహకార దర్శకత్వమును సమకూరుస్తున్నారు. కె. కమలారెడ్డి నిర్మిస్తున్న ఈ చిత్రంలో "చిరుతపులి" చేసే చిత్రమైన పనులు ఒక ప్రత్యేక ఆకర్షణ. మార్చిలో బందిపూర్ ఫారెస్టులో (కర్నాటక) జరిగే షూటింగ్‌తో చిత్రం పూర్తవుతుంది.

'ముద్దుల కొడుకు'లో అక్కినేని

మా అమ్మ నా బట్టలన్ని
సింగర్ సూయింగ్ మెషీన్‌పైనే కుట్టేది.
నేడు మా వివాహ వార్షికోత్సవ సందర్భంగా
మా ఆవిడకి నేను సింగర్ వారి
మెరిట్ కానుకగా ఇస్తున్నాను.





# మెరిట్*

## సూయింగ్ మెషీన్

## జీవిత కాలమంతా మన్నే కానుక

## ...ఈ మెషీన్‌లోకి వెళ్ళే 307 భాగాలలో ప్రతిదాన్నీ సింగర్‌వారు పరీక్షించడమే అందుకు కారణం.



కానుకగా ఇచ్చేందుకుగాను సింగర్ వారి సూయింగ్ మెషీన్ తరతరాలుగా గొప్ప ఎన్నికగా వస్తూ ఉంది—పెళ్ళి కానుకగానైనా సరే, వార్షికోత్సవపు కానుకగానైనా సరే. ఎక్కువ మంది ప్రజలు సింగర్‌నే ఎన్నుకోడానికి ఇవి కొన్ని కారణాలు:

### అనుభవం




సింగర్ వారు ప్రపంచంలో మొదటి సారిగా వాణిజ్య కుట్టు మిషన్లు అమ్మడం ప్రారంభించారు. అంటే 125 సంవత్సరాల అనుభవం అన్నమాట. నేడు భారతదేశంలో అత్యంత పాతవైన కుట్టు మిషన్లు సింగర్ మెషీన్లే. వాటిలో కొన్నిటిని మీరు చూసే ఉంటారు.

### విస్తృత శ్రేణి

విస్తృత శ్రేణిలో గల ఎన్నో కుట్టు మిషన్ల నుండి మీరు ఎన్నిక చేసుకోవచ్చు ప్రతి వారి అవసరాలకు అనువైె అందుబాటులో ఉండే మోడల్స్ ఉంటాయి

### పథకాలు

సింగర్ వారు అనువుగా ఉండే వాయిదాలలో కొనుగోలు పథకాలను ప్రవేశ పెడుతూ ఉంటారు గనక ఒక్కసారిగా మీరు సొమ్ము చెల్లించ లేకపోతే-సులభ వాయిదాలలో చెల్లించవచ్చు.

### పొదుపు



మీ ఇంట్లో వారందరి బట్టల్ని మీరే కుడితే ఎంత పొదుపు చేయగలరో ఆలోచించండి. బట్టల్ని కుట్టేందుకు ఈ రోజుల్లో ఎంత ఖర్చవుతుందో చూస్తే చాలు, ఈ కుట్టు మిషన్ ఖరీదును అదే రెండేళ్ళలోగానే మీరు చెల్లించెయ్యవచ్చు అని మీకే అనిపించి తీరుతుంది

### షాపులు

సింగర్ వారికి దేశమందంతటా డీలర్లున్నారు గనక మీ ఇంటికి బాగా దగ్గరలో సింగర్ షాపు ఉంటుంది లేక డీలర్ ఉంటాడు.

### సేవా సౌకర్యం

సింగర్ వారి కుట్టు మిషను చిరకాలం మన్నేదిగా రూపొందించబడుతుంది. విస్తృతంగా గల సింగర్ షాపుల వలన మీ కుట్టు మిషన్ ఎల్లప్పుడూ మంచి స్థితిలో ఉండేటట్లు చూసేందుకు నిపుణులైన వారి సేవాసౌకర్యం ఉంటుంది. జీవిత కాలమంతా మీరు సేవను పొందవచ్చును.

### నిమిషానికి 1000 కుట్లు

నిమిషానికి 1000 కుట్లు కుడుతుందని తేలిన కుట్టు మిషన్ మెరిట్. మెరిట్ సూయింగ్ మెషీన్‌లో అమర్చబడే ప్రతి భాగాన్నీ సింగర్ వారు కఠినంగా పరీక్షిస్తారు. ప్రతి మిషన్ ఖచ్చితంగా పనిచేసేలా తయారుచేయబడుతుంది... జీవిత కాలమంతా మన్నేలా.



### ఎప్పుడూ కుట్టు దాటిపడదు

మెరిట్, ఒక్క కుట్టూ దాటి పోకుండా, ఆగకుండా 4000 గంటల పాటు నడవాలని సింగర్ వారి అంచనా. నాణ్యత గురించి ఇలా శ్రద్ధ తీసుకుంటారు గనకనే సింగర్ వారికి ప్రపంచ విఖ్యాతి.

## సింగర్ నుండి

## మెరిట్ సూయింగ్ మెషీన్

ఇది మీతోబాటే ఎన్నో వార్షికోత్సవాలను దర్శిస్తుంది.

* సింగర్ కంపెనీ ట్రేడ్‌మార్క్.

CHAITRA-SM-273 TEL



'పంచ భూతాలు'లో లత, సత్యప్రియ

## అంజలీ పిక్చర్స్‌లో శోభన్‌బాబు

ఉత్తమ చిత్రాల నిర్మాత శ్రీ ఆదినారాయణ రావు తెలుగు వత్సరాది పర్వదినాన ప్రారంభించనున్న నవలా చిత్రానికి... శ్రీ శోభన్‌బాబు నాయకుడుగా కుమారి జయప్రద నాయికగా ఎంపిక అయ్యారు.

శ్రీ విక్టరీ దర్శకత్వంలో రూపొందే యీ రంగుల చిత్రానికి సత్యానంద్ మాటలను, ఆదినారాయణరావు సంగీతాన్ని సమకూరుస్తారు.

## ఇది విన్నారా?

★ "వరుసగా మూడు సంవత్సరాలనుంచి నా పుట్టిన దిన సంబరాన్ని శ్రీ దేవర్ ఫిలిమ్స్ యూనిట్‌తో జరుపుకుంటూ వచ్చాను. ఈ సంవత్సరం కూడా వారి "అమ్మ ఎవరికైనా అమ్మ" షూటింగ్‌లో వున్నాను నా బర్త్‌డే రోజు. మొదటి సంవత్సరం "అట్టుకార అలమేలు", రెండవ సంవత్సరం "పొట్టేలు పున్నమ్మ", మూడవ సంవత్సరం "తాయిమీదు సత్తియం" చిత్రాల షూటింగ్స్‌లో వున్నాను సరిగ్గా నా పుట్టిన రోజు అంది శ్రీప్రియ. ఆ సుబ్రమణ్యస్వామి భక్తుడైన శ్రీ దేవర్ సమక్షంలో, తన జన్మదిన వేడుకన్ని చేసుకున్న శ్రీప్రియ నిజంగా అదృష్టవంతురాలే. కానీ ఆమె ఆనందంలో పాలుపంచుకుని, ఆశీర్వదించడానికి ఈసారి ఆ మంచి మనిషి లేకపోవడమే విచారకరం.

★ మద్రాసులో వి. జి. పి. గోల్డెన్ బీచ్‌కున్న డిమాండు ఇంత అని చెప్పలేము. ఎందుకంటే దక్షిణాదిన తయారయ్యే సినిమాల్లో 75 శాతం అక్కడ షూట్ చేయబడుతుంటాయి. ఆ స్థలానికి వి. జి. పి. బ్రదర్స్ హక్కుదార్లు. ఈ సినిమావాళ్ల రద్దీని చూచిన ఆ బ్రదర్స్ వారికి మరింత సౌకర్యాన్ని కల్గించే నిమిత్తం ఆ ప్రాంతంలో ఒక స్టుడియోను కట్టాలని ఆలోచిస్తున్నట్టు వార్త. ఎ గుడ్ అయిడియా.

★ మళయాళ నటి విధుబాల తండ్రి మాజిక్ చేయడంలో మాస్టరట. ఈ విద్యను తన కూతురికి కూడా నేర్పించాడట. ఇపుడు ఆ విద్యలో తండ్రిని మించిన తనయురాలైందట విధుబాల. సో సినిమాలు లేకపోయినా ఫరవాలేదు, విధుబాల వైభవానికి లోటుండదు.

— శ్రీనివాస్ ★

# జి. ఏ. జి. పేజీ

## "కొత్త అల్లుడు" ఆటోగ్రాఫ్

మందుల షాపులో కూర్చొనున్న హరి (కృష్ణ)కు లీల (జయప్రద) నవ్వుల కిలకిలలు వినిపించడంతో తలెత్తి చూసి విస్మయపోయాడు. కారుపక్కన లేత ఆకుపచ్చ పరికిణీ, ముదురాకుపచ్చ వోణీ, ఆదే రంగు అంచుగల జాకెట్టు, పచ్చల పతకం, పాపిడిపక్కగా ఆకుపచ్చని సంపెంగపువ్వు— గాజులు, చేతి గడియారం గొలుసు, నుదుట బొట్టు – అన్నీ ఆకుపచ్చన... ఆకుపచ్చని ఆటోగ్రాఫ్ బుక్ తెరుస్తూ, జాకెట్‌లోంచి గ్రీన్ పెన్ తీసి, "నా పేరు లీల. మీ పేరు నాకు తెలుసు. నాకు మీ ఆటోగ్రాఫ్ కావాలి," అందామె.

మరింత తెల్లబోయిన హరి నవ్వుతూ, "హిహి... మీరు అనుకునే సినిమా హీరోకీ – నాకూ పోలికలున్న మాట నిజమే – కాని, నా పేరు కృష్ణ కాదు; హరి," అన్నాడు.

"నటుడిగా నటించి మోసగించనందుకు థాంక్స్."

"నటన నా జీవితంలో లేదు. ఉండదు. మంచివాళ్ళ దగ్గర అసలుండదు."

"ఐ నో... అందుకే మీరు నా హీరో... ప్లీజ్ !"

"నేను..."

"మహాప్రభో ! నాకు తెలుసని చెప్పాను కదా ? ఏం – సినిమావాళ్ళు తప్ప మరెవ్వరూ ఆటోగ్రాఫ్ పెట్టరా ? క్రికెట్ హీరోలు, స్టంట్ హీరోలు, ఆడే హీరోలు, పాడే హీరోలు, ఆటోగ్రాఫ్ హీరోలు లేరా ?"

హరి దండంపెడుతూ, "మహాప్రభో ! ఆ బుక్కు తెరవండి. సంతకం పెట్టేస్తాను," అన్నాడు. లీల ముసిముసిగా నవ్వుకుంటూంటే అదేపనిగా సంతకాలు పెట్టసాగాడు.

"మహాప్రభో ! మీ జీవిత కథంతా రాసేస్తున్నారా ? వద్దు. నేనడిగింది మీ సంతకం – హరి యను రెండక్షరములు," అంది లీల.

"అంతేనండి... కోప్పడుతున్నారని రామకోటిలా హరికోటి రాసేశా," అంటూ రెండు పేజీలనిండా ఉన్న గొలుసురాతను చూపించాడు హరి. లీల విరగబడి నవ్వుతూంటే – ఆమెను ఆ పాదమస్తకం తెల్లబోయి చూస్తూండిపోయాడు.

సత్యచిత్ర సమర్పించే శ్రీ సిద్ధార్థ ఫిలింస్ "కొత్త అల్లుడు" వర్ణ చిత్రానికి ముళ్ళపూడి వెంకటరమణ రచయిత. మహదేవన్ సంగీత దర్శకుడు. వి. ఎస్. ఆర్. స్వామి ఛాయాగ్రాహకుడు. పర్వతనేని సాంబశివరావు దర్శకుడు.

## డైరెక్టర్ వి. మధుసూదనరావు చిత్రాలు

శోభన్‌బాబు హీరోగా ఉగాదినాడు పాటల రికార్డింగ్, ఏప్రిల్ మొదటి వారంలో షూటింగ్ ప్రారంభమయ్యే అంజలీ పిక్చర్స్ వర్ణ చిత్రానికి సత్యానంద్ స్క్రిప్టు రాస్తున్నారు. సంగీతం, నిర్మాత : పి. ఆదినారాయణరావు. ఆ తర్వాత ఎ. ఎన్. ఆర్. తో "శాంత్ జ్ఞానేశ్వర్" ఆధారంగా ఇంకో చిత్రాన్ని ప్రారంభిస్తారు.

జయసుధ, మురళీమోహన్, మోహన్‌బాబు అల్లు రామలింగయ్య, రమాప్రభ ముఖ్య భూమికలు నిర్వహించే శివకామేశ్వరీ ప్రొడక్షన్స్ వర్ణ చిత్రానికి విజయకుమార్ నిర్మాత. కథ : బాబీ. మాటలు : బొల్లిముంత శివరామకృష్ణ. సంగీతం : జి. కె. వెంకటేశ్.



'వజ్రాల వేట'లో జయమాలిని

'కథ మారింది'లో కె. విజయ, ఈశ్వరరావు



## వాణిశ్రీ కొత్త చిత్రాలు

"వివాహమయ్యాక కూడా చిత్రాల్లో నటిస్తాను. అసలీవేళ ఉదయమే రెండు కాంట్రాక్టులమీద సంతకం చేశాను," అన్నారు వాణిశ్రీ. ఆమెకు ఫిబ్రవరి 28 రాత్రి 11 గం. 52 ని.లకు మద్రాసు వడపళనిలోని శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామి ఆలయంలో డా॥ కరుణాకరన్, ఎం. బి., బి. ఎస్. తో వివాహం జరిగింది. ఆయన ప్రస్తుతం ఎం. ఎస్. చేస్తున్నారు. ఆయన చాలాకాలం నుంచి వాణిశ్రీ కుటుంబానికి ఫామిలీ డాక్టర్, ఫామిలీ ఫ్రెండ్ కూడాను. "అసలు ఎనిమిది మాసాల క్రితమే మా వివాహాన్ని పెద్దలు నిశ్చయించారు. నా షూటింగ్‌ల ఒత్తిడివల్ల ఇప్పటికిగాని వీలయింది కాదు," అన్నారు వాణిశ్రీ. "ఈమె నటించిన 'సతీసావిత్రి, గోరంతదీపం, వసంతమాళిగై (ప్రేమ్‌నగర్), ఉయిరిన్‌దమనిదన్' చిత్రాలు చూశాను. షి ఈజ్ ఎ బార్న్ ఆర్టిస్ట్. అంచేత, ఇటుపైన కూడా చిత్రాల్లో నటించడానికి నా అభ్యంతరం ఏమీలేదన్నాను," అన్నారు డాక్టర్ కరుణాకరన్. వాళ్ళ పూర్వీకులు లోగడ గుంటూరులో పుగాకు వ్యాపారం చేసేవారట. అంచేత, వాళ్ళ కుటుంబంలో అందరికీ తెలుగు బాగా తెలుసు.

ఏప్రిల్ 14న పాటల రికార్డింగ్, మే 1న షూటింగ్ ప్రారంభమయ్యే శ్రీ కుమారస్వామి పిక్చర్స్ వర్ణ చిత్రంలో వాణిశ్రీకి హీరో శోభన్‌బాబు. మోహన్‌బాబు, ప్రభాకరరెడ్డి, కాంతారావు, రాజ్‌బాబు, మమత, పండరీబాయి ఇతర ముఖ్య భూమికలు నిర్వహిస్తారు. రచన, సంగీతం, ఛాయాగ్రహణం శాఖలను రాజశ్రీ, సత్యం, జె. సత్యనారాయణ నిర్వహిస్తారు. రాజాచంద్ర దర్శకుడు. పింజల సుబ్బారావు సమర్పణలో జ్యోతి కుమారస్వామి నిర్మించే ఈ చిత్రానికి నిర్మాణ పర్యవేక్షణ : పుష్పదంత్.

"నల్లదొరు కుటుంబం" తమిళ చిత్రంలో శివాజీ సరసన నటించే వాణిశ్రీ జూలైలో రవిరాజ్ ఫిలిమ్స్ ప్రారంభించే చిత్రంలో నాయిక.

## "అందడు–ఆగడు"లో ఆగని మనిషి

విజయ్ మెల్లగా తన గది తలుపు తెరిచి, జాగ్రత్తగా చూస్తూ లోపలికి వచ్చాడు. లత ఒక సోఫాలో కూర్చొని ఏదో పత్రిక తిరగేస్తోంది. విజయ్ ఆమె వీపుకు రివాల్వర్ గురిపెట్టి, చిరునవ్వుతో "హల్లో!" అన్నాడు. లత కంగారుగా వెనక్కి తిరుగుతూ లేచి నిలుచునేసరికి విజయ్ నిర్ఘాంతపోయాడు. "నువ్వా! ఇందాక హోటల్లో అడ్డుపడ్డావు. ఇప్పుడు నా రూమ్‌లో ఏం చేద్దామని వచ్చావు?"

"నా పేరు లత. పద్మ గురించి వచ్చాను. పద్మ నా చెల్లెలు."

"వండర్‌ఫుల్! అయితే, నాకు ఇంకో సిస్టర్ కూడా ఉందన్నమాట? ఆ అమ్మాయి కూడా నీలాగే అందంగా ఉంటుందా?"

"ఎందుకిలా మాట్లాడుతున్నారు? పద్మ గురించి మా అమ్మగారితో మాట్లాడారు. పద్మ ఫోటో కూడా తీసుకున్నారు. పద్మ గురించి మీకు పూర్తిగా తెలుసు. కాని, ఆమె ఎందుకు మాయమైందో, ఎలాటి ప్రమాదంలో చిక్కుకుందో మాకేమీ అర్థం కావడంలేదు. దయచేసి చెప్పండి. మా పద్మ ఎక్కడుంది? ఎలా ఉంది?"

ఇంతలో టెలిఫోన్ బెల్ మోగింది. విజయ్ వడివడిగా పక్క గదిలోకి వెళ్ళి, రిసీవర్ అందుకున్నాడు. అటు చివర రౌడీలు పద్మను కత్తితో బెదిరించి, ఆ రాత్రి శక్తి గెస్ట్‌హౌస్ ప్రాంతానికి రమ్మని విజయ్‌తో చెప్పమని బలవంతం చేశారు. పద్మ అలాగే చెప్పింది. ఈ సంభాషణంతా ఎక్స్‌టెన్షన్ ఫోన్ నుంచి విన్న లత "నేనూ మీతో వస్తాను," అంది విజయ్‌తో.

"సరే... మీ ఇష్టం!" అంటూ విజయ్ చివాలున తలుపు మూసి, గొళ్ళెం పెట్టేశాడు. "తలుపు తెరవండి, ప్లీజ్!" అని లత ఎంతగానో మొత్తుకుంది. "టా టా!" అంటూ విజయ్ నవ్వుతూ వెళ్ళిపోయాడు.

విజయ్ (కృష్ణంరాజు), లత (లత) టెలిఫోన్‌లో విన్న పద్మ కంఠం కవితదని తెలియజేశారు డైరెక్టర్ ఎస్. డి. లాల్. సుందర్‌లాల్ సమర్పించే శ్రీకాంత్ పిక్చర్స్ స్కోప్ కలర్ చిత్రానికి శ్రీకాంత్ నహతా నిర్మాత. 

/ప్రారంభం/


వైశంపాయను మహర్షి జనమేజయునకు శ్రీమహాభారత కథ చెప్పుచు...
జనమేజయ రాజా! పాండవులు ఆవిధంగా తమ సర్వస్వము జూదములో పోగొట్టుకొని ద్రౌపదిని వెంటపెట్టుకొని ఉత్తర దిక్కుగా బయలుదేరినారు


2-1 215
ఇంద్రసేనాదులైన మూల భృత్యులు పదునాలుగు వేల రథంబులును సుభద్రాభిమన్యులను ప్రతివింధ్యాది ఉపపాండవులను వెంటనిడుకొని వచ్చి, పాండవులతో కలసి ప్రయాణము సాగించిరి.


పౌరజనంబులు పాండవులతో అరణ్యములకు వచ్చెదమని బయలుదేరిరి...కాని.. ధర్మరాజు వారికి మంచిగ నచ్చచెప్పి వెనుకకు పంపివైచెను...తరువాత బ్రాహ్మణులు వచ్చి...


ధర్మరాజా! విప్రులము నిత్య జపహోమాది పుణ్యక్రియలతో మీకు సంతోషము కలుగజేయుచుండెదము మీతో వచ్చుటకు మాకు అనుజ్ఞ నిమ్మని వేడుచున్నాము...
భూసురోత్తములారా! అరణ్యవాసము కడు భయంకరమైనదని మీకింత చెప్పవలసి వచ్చినది...సరే.
2-2 216


పూజనీయులైన బ్రాహ్మణోత్తములు కూడ కందమూలములు తినుచు మావెంట నున్నారే! ఇది భరింపలేను....


మహాత్మా! ధౌమ్య మహర్షీ! అరణ్యవాసము చాల దుర్భరమైనదని, వెనుకకు మరలిపొండని ఎంతగానో చెప్పాను కానీ బ్రాహ్మణులు మనతోనే ఉంటామని వచ్చారు.... ఈ మహారణ్యమున మనమందరికు ఏవిధముగ ఆహారము సంపాదించగలము? నన్ను ఏమి చేయుమంటారు
ధర్మరాజా! "అన్నం ఆదిత్యమయం". ఆవిషయము తెలిసికొని తొల్లి భీమ, వైన్య, కార్తవీర్య నహుషాదులు యోగసమాధినిష్ఠితులై సూర్యుని భజియించి అన్నమును పొంది ప్రజలను కష్టముల నుండి కాపాడిరి.
2-3 217


సూర్యదేవుని ప్రసన్నుని జేసికొనే అష్టోత్తర శతమును అనుష్ఠించు విధానమంతయు నీకు ఉపదేశించెదను.


ధర్మరాజు ధౌమ్యుని ఉపదేశమును పొంది సూర్యుని గురించి ఉగ్ర జపము జేసెను


2-4 218
ధర్మరాజా! నీ తపమునకు మెచ్చితిని. ఇదిగో అక్షయపాత్ర ఈ పన్నెండు సంవత్సరములు మీచే సేకరింపబడు వన్యఫలమూల శాకంబులు మీదేవి ద్రౌపదిచే ఈ పాత్ర యందుంచబడి అక్షయమగు చతుర్విధ ఆహార మహాప్రసాదములుగ మీకెల్లరకూ సమకూరుచుండును.

[ఇంకా వుంది]

వినోద్ ఆ డబ్బంతా కట్టేసి తన పేర ఆ తనఖా మార్చుకున్నాడు.''

''వినోద్ ఎంత మంచివాడు! మనకు ఆ మదనలాల్‌వల్ల ఎట్టి ప్రమాదం సంభవించకుండా ఉండేటట్లు ఈ పెద్ద అప్పునుకూడ తీర్చేసి మనల్ని మళ్ళీ ఆదుకున్నాడు. దానికి దిగులుపడ్డా రెందుకు మనకు మేలే జరిగిందికదా ?''

''అదికాదోయ్ — అందులో నిగూఢమైన ఓ భయముంది''

''భయమా ! — ఎవరికి ? ఎందుకు ?''

''ఇంతవరకు వినోద్ 'మీ ఇల్లు, మీ తోట' అంటున్నాడు. మన స్థలంలో ఓ కూరగాయల ఫారమ్, ఓ ఫాక్టరీ పెట్టానన్నాడు. నలభై అయిదువేలు చెల్లించి ఆ దస్తావేజులను తను తీసుకోడంవల్ల ఏమయిందో ఆలోచించావా ? ఈ ఇల్లు, ఈ తోట ఇప్పుడు వినోద్‌వే. అతని స్థలంలో అతని డబ్బుతో అతడు ఓ ఫాక్టరీని, ఓ ఫారమ్‌ని పెట్టుకున్నాడు. మనం ప్రస్తుతానికి మేనేజర్లుగా మాత్రమే మిగిలిపోయేము. ఇన్నాళ్ళు మనం నామమాత్రపు యజమానులుగానైనా ఉండే వాళ్ళం—ఇప్పుడా నామంకూడ లేకుండాపోయింది.''

''అంటే ?''

''అంటే — ఇప్పుడు మన లావణ్య అతనితో పోట్లాడి ఇంటి నుండి పొమ్మన్నదికదా—అతను చాలా కోపంతో వెళ్ళిపోయేడుకదా, పర్యవసానమేమిటో తెల్సుకున్నావా? అతను మనల్ని ఇక్కడనుండి గెంటి వేయించగలడు ఇప్పుడతనికి ఆ హక్కు కల్గింది.''

విశాలాక్షి తన చెవుల్ని తనే నమ్మలేకపోయింది.

''మీరేం మాట్లాడుతున్నారో మీకు తెల్సునా— మీకు మతిభ్రమించలేదుకదా? ఇన్నాళ్ళు మనింట్లో మన పిల్లడిలా మెలగి మనకి మళ్ళీ ప్రాణంపోసి బ్రతికించి నల్గురిలో మనం మళ్ళీ తలెత్తుకుని తిరగగల్గేటట్లు చేసిన మన వినోద్‌కి అంత దారుణమైన ఊహన్ని అంటగడుతున్నారా ! ఇంతకీ నాకో సందేహం కల్గుతుంది — నిజం చెప్పండి. ఈ గొప్ప ఆలోచన స్వంతంగా మీకే కల్గిందా లేక ఎవరైనా ఈ విషాన్ని మీ మెదడులోకి ఎక్కించేరా ?'' అని నిష్ఠూరంగా అడిగింది. ఆమె గంభీరతకు, ఆమె కోపానికి భూషణం చలించి పోయేడు

''కోపం తెచ్చుకోకు విశాలా — అబ్బాయి మంచివాడే నేను కాదనను.''

''ముందు నేనడిగినదానికి జవాబు చెప్పండి.''

''ఇందాక ఊరిలోకి వెళ్తుంటే రామలింగం కనుపించి ఈ సంగతంతా చెప్పేడు. అందుకే నాకీ సందేహం కల్గింది. కొంపదీసి లావణ్య మీద కోపం మనందరిమీదా చూపించి ఇక్కడనుండి పొమ్మనడుకదా అనుకున్నా. మరి వినోద్ మనకి అలా అప్పు తీర్చేసి తనఖా కాగితాలను తను తీసుకున్నట్లు ఎందుకు చెప్పలేదు ? మరి రామలింగాన్ని పదే పదే ఈ వ్యవహారాన్ని రహస్యంగా ఎందుకుంచమన్నట్లు ?''

''చూడండి నిజంగా మీకు మతి సరిగలేదు. మనం ఊరు వెళ్ళినప్పుడు ఈ అప్పు చెల్లించడం జరిగింది మనం తిరిగొచ్చేసరికి వినోద్ ఇక్కడ

# జీవిత మాధుర్యం

నుండి వెళ్ళిపోయేడు. మనం మరి అతనిని కల్సిందెప్పుడు. అందుకే అతనికి చెప్పే అవకాశం కల్గలేదు. అతనికి కోపం తగ్గేక అతడే హైదరాబాదు నుండి మనకు మంచి వార్తను తెలియజేస్తాడు, మదన్‌లాల్ గురించి మరి బెంగ పెట్టుకోవద్దని. ఇంతకీ మీరు మళ్ళీ ఆ రామలింగంతో స్నేహంగా మాట్లాడడం నాకు ఆశ్చర్యాన్ని కల్గిస్తూంది. అతడు మన దగ్గర నౌఖరీకి చేరి మనని, మరిది చక్రవర్తిని సర్వనాశనం చేసినా, ఆ రామలింగాన్ని ఇంకా నమ్ముతున్నారా ? అతడు పిలచి మీకివన్నీ చెప్పేడంటే అందులో ఏదో కుట్ర వుండితీరుతుంది. రామలింగం నిలువెల్లా విషమే. కాస్త విషం మీకు ఎక్కించ చూస్తున్నాడు. మీరు ఇకమీదట ఆ రామలింగంతో మాట్లాడుతే నేను ఒప్పుకోను. ఇంకో విషయం తెల్సుకోండి. మీరుగాని లావణ్యగాని వినోద్ గురించి చెడుగ ఏమి చెప్పినా నేను వినను — విన్నా నమ్మను. అతడు నా దృష్టిలో ఎల్లప్పుడూ దేముడే. నా విశ్వాసం ఎన్నటికీ సడలదు,'' అని దిగ్గునలేచి విశాలాక్షి గదిలోనుండి వెళ్ళిపోబోయింది. ఆసరికే ద్వారంవద్ద నిల్చున్న సుకుమార్ ఈ సంభాషణ విన్నాడు.

''అమ్మతో నేను ఏకీభవిస్తాను. వినోద్‌గారు నాకూ దేముడే. అతని హృదయమంతా మనయెందు కరుణతోనిండి ఉంది. అసలు మన ఫోర్‌మన్ ముసలయ్య చెప్పినదాన్నిబట్టి అతను కోటీశ్వరుడట. అతనికి చాలా ఫాక్టరీలున్నాయట. అంతటి ధనికుడు, ఉదారుడు మన ఈ ఇంటిని, ఈ తోటను అందులో అతని డబ్బుతోనే నెలకొల్పబడిన ఈ చిన్న ఫాక్టరీని, ఈ ఫారమ్‌ని అతడు కాంక్షిస్తున్నాడంటే నేను నమ్మను. ఇంతకీ ఇదంతా అతని డబ్బేగా ! న్యాయంగా అతని ధనాన్ని అతనికి తిరిగి, ఓ వేళ అతడు కోరిన, ఇవ్వడంలో అధర్మం యేమీలేదు. ఇవన్నీ అతనికో లెక్కకావు. అతని ధ్యేయం మనం బాగుపడడమే. మీరు, లావణ్యక్క అతనిగురించి ఏమనుకున్నా, అమ్మలా నాకున్న వినోద్‌గారిమీదున్న సదభిప్రాయం ఏమాత్రం మారదు. నాన్నగారూ ! వినోద్‌గారి గురించి పొరబాటునైన చెడుగ తలచకండి — మనకు మేలు జరగదు,'' అని విచారంగ సుకుమార్ తల్లితో కలసి ఆ గదినుండి వెళ్ళిపోయేడు.

ఈ హఠాత్తు పరిణామానికి భూషణం నిశ్చేష్టుడయ్యేడు. తరువాత చాల సిగ్గుపడి పోయేడు. వినోద్ గురించి అలా తలపోసినందుకు చాల బాధపడిపోయేడు. తనవాళ్ళకున్న నమ్మకం తనకు ఏమాత్రం సడలనందుకు కుంచించుకు పోయేడు. మరి ఎట్టి పరిస్థితులలోను ఆ రామలింగంతో మరి మాట్లాడకూడదని నిశ్చయించుకున్నాడు.

లావణ్య పరిస్థితి దుర్భరంగ ఉంది. వినోద్ మాటిమాటికి ఆమె తలపుల్లోకి వస్తున్నాడు. ఆ చిరునవ్వు ముఖాన్ని మరచిపోలేకపోతూంది కాని మరి తను చదివిన ఉత్తరాలు అబద్ధమా ? కావే — తను ఆ ప్రేమపూరిత మాటలన్నిటినే చదివిందే. వినోద్‌కి అంతమందితో సంబంధ మేమిటి ? ఆమె ఏవిధంగ ఆలోచించిన ఆమె తన మనస్సును సమాధానపర్చుకోలేకపోతూంది

ఇంట్లోకూడ కొంత మార్పు వచ్చింది. తమ్ముడు సుకుమార్ తను వినోద్‌ని ఇంటినుండి పొమ్మన్నందుకు కొంత కినుక వహించేడు. మునుపటిలా సరదాగా తనతో మాట్లాడడంలేదు. తల్లి విశాలాక్షి, తన అవివేకానికి తనపై జాలి పడుతున్నట్లు ప్రవర్తిస్తోంది. ఆ జాలి లావణ్యకు చాల బాధకరంగనుంది. తండ్రి భూషణం యెప్పుడు ఆ ఫారమ్‌లోనో, ఆ ఫాక్టరీలోనో కాలం గడుపుతున్నాడు. అతడి మనస్సులో తనమీద ఎట్టి అభిప్రాయమున్నదో లావణ్యకు తెలియడంలేదు.

ఇక చెల్లి వనజ, తమ్ముడు గోపీ మాటిమాటికి లావణ్యతో వినోద్ కబుర్లే ముచ్చటిస్తుంటారు. వాళ్ళిద్దరూ 'వినోద్ బావగారు' అని మాట్లాడుతుంటే ఆమె గుండెలో ఏవో సూదులు గుచ్చుకుంటున్నట్లుగా వుంటుంది. వాళ్ళిద్దరూ వినోద్‌ని తలచుకుని మురిసిపోతుం టారు. వాళ్ళిద్దరికి ఆ వినోద్‌బావగారి పైన అపారమైన ప్రేమ. లావణ్య అంతరాంతంలో ఆ ప్రేమను తను పంచుకుంటే బాగుండును అని వున్నా, ఆమె మనస్సు ఒప్పుకోవడంలేదు. వినోద్ యెందు ఆమెకు కల్గిన అపోహ తొలగిపోలేదు. అతడియెందు ఆమెకు కోపం తగ్గలేదు.

ఈ సంఘర్షణవల్ల లావణ్య చాలా మధనపడి పోతూంది. ఆమెకు ప్రియమైన ఆ గులాబి తోటలో సాయంత్రం గడిపినప్పుడల్లా ఆమె కిష్టంలేకపోయినా వినోద్ ఆమె చెంతకు చేరి ఆమె చెయ్యి పట్టుకున్నట్లుగా, ఆమె చెంపను ముద్దిడినట్లు భ్రమ కల్గి ఆమెకు మరింత బాధ కల్గుతుండేది.

## 16

ఆనాడు ఆదివారం. అశోక్ కోర్టుకు వెళ్ళే పనే లేదు. అశోక్ మనస్సులోని ఓ సందేహం చాలాకాలమైంది అతడిని బాధిస్తూంది. దాని నివృత్తికోసం వినోదమూర్తి ఇంటికి పొద్దున్న తొమ్మిదిగంటలకు వచ్చేడు. వినోద్ టిఫిను, కాఫీ ముగించి మేడమీద తన గదిలో పేపరు చదువు కుంటున్నాడు.

''హలో అశోక్ ! — రా,'' అని చిరునవ్వుతో పలకరించేడు.

''టిఫిను తీసుకుంటావా ?''

''ఒద్దు వినోద్ తీసుకునే వచ్చేను.''

''పోనీ కాఫీ.''

''ఇప్పుడొద్దులే, కాస్సేపుపోయేక తీసుకుంటా.''

''ఓకె — మరేమిటి విశేషాలు ?''

''విశేషాలు నువ్వే చెప్పాలి.''

''ఏ విషయం చెప్పమన్నావు ?''

'మీ ఆనందనిలయం సంగతి. ఆనాడు నేనడుగుతే మూడ్‌లేదు—మరోసారి చెప్తానన్నావు.''

వినోద్ పేపరును టేబిలుమీద పడేసి వాలుకుర్చీలో వెనక్కు వాలి కాస్సేపు ఆలోచించేడు. అశోక్ కుతూహలంతో సోఫాలో ఈజీగా కూర్చున్నాడు [ఇంకా వుంది]

"ముసలితనం శరీరానికొస్తుంది గోపాలకృష్ణా; మనస్సుకి రాదు. నాకి వుద్యోగం కాదు ముఖ్యం– ఇక్కడ వుండడం" అంది.

"ఈ రుంటాడిని చంపిపారేసి నీపని పట్టాలి. నా కళ ముందుండి నాకు శాంతి లేకుండా చేశావు ఇన్ని సంవత్సరాలు"

"సెభాష్! ఇన్నాళ్ళకేనా గ్రహించావు గద! అంతేచాలు. నా పని అయిపోయింది. ఇక నువ్వేం చేయలేవు. నీకు జ్ఞాపకం వుందో లేదో– ప్రతి కృష్ణుడికీ ఓ కంసుడు– కాదిక్కడ, కాస్త రెండితలయ్యాయి పేర్లు! కోటిగాడు నే వచ్చిన రోజునే నీకు బుద్ధి చెప్పాడు నీ నెత్తి మచ్చ దానికి సాక్ష్యం. ఇలాంటిది మరిచిపోడం అంత ఒంటికి మంచిది కాదు. జ్ఞాపకం వుంచుకో. యిక వెళ్ళు!" అంది.

అరుగు మీదే నిలబడ్డాడు బాబా. "బాబూ! అయ్యగారున్నారా?" అన్నాడు.

"ఏంరోయ్ సంగతి మోస్తావా?" విసురుగా వెళ్ళిపోయాడు. అక్కడ ఇందిర ఒంటరిగా వుంటుందని, నాలుగూ అడిగేయాలని అనుకున్న కృష్ణుడికి బాబా కంటిలో ముల్లులా గా తోచాడు!

విసురుగా వెళ్ళిపోతున్న గోపాలకృష్ణుని చూసి, "బేటీ! ఎందుకీ మనిషికింత కసి? చెప్తానంటావేగాని, ఎప్పుడూ చెప్పనేలేదేం? ఇన్నేళ్ళ తరవాత కూడా యింత కసి మిగుల్చుకున్నాడంటే, ఎంతో ఆశ్చర్యంగా వుంది బేటీ" అన్నాడు.

పల్లెమీద చీకటితెర వాలుతోంది. తోలుకొస్తున్న పశువులు రేపుతున్న దుమ్ములో మంచి నీరెండ బంగారపు రేణువుల్లాగా మెరుస్తోంది.

"అది చాలా పాతకథ బాబా! నేను చదువుకునేటప్పటి కథ. నాతో చదువుకున్నాడు గోపాలకృష్ణ. నన్ను నమ్మించి మోసం చేసాడు. మా నాన్నగారు వీరి నాన్నగారూ స్నేహితులు. వియ్యం అందామనుకునేవారు. కాని ఎందుకో నామీద అభాండాలు పుట్టించి, నా శీలం మంచిది కాదని– నేను గర్భిణీనని, నాపేరు చెరిచాడు. నాకు పెళ్ళి అంటే అసహ్యం వేసింది. అందుకే– యిలా వితంతువులా మారిపోయాను. ఇది ఒక రక్షణే కాదు– తన కళ్ళెదుట నన్ను యిలా చూస్తూ, నిజం తెలిసీ ఏమీ చేయలేని ఉడుకుబోతుతనంతో, యిలా చేశాడు. ఇతనిక్కడికి వచ్చేదాకా నాకితడిక్కడ వున్నాడని తెలియదు. టీచర్నుండక పోవడం ఇతని వల్లేనని యిక్కడికి వచ్చాకనే తెలిసింది బాబా! అందుకే ఇక్కడ నుంచి కదలకూడదని నిర్ణయించుకున్నాను. ఇతని తండ్రి ఇతన్ని వదులుకున్నాడు– యితగాడు చేసిన వెధవ పనులకి. ఆయన దేవుడులాంటి వాడు. వెంకన్న బయట పడడానికి కాదు, కోటిగాడు స్కూల్కి రావడానికి కూడా ఆయన చలవే కారణం బాబా... పద యిద్దరం వెళదాం హరిజనవాడ. ఈ వార్త విని ఆనందించేవాళ్ళు అక్కడే వున్నారు" అంటూ తలుపునేసి బయలుదేరింది ఇందిర.

"అంత దారుణం అయిన నిర్ణయాన్ని ఇంత నవ్వుతూ ఎలా తీసుకోగల్గావమ్మా!" వింత పడుతూ కర్ర టక్కు టక్కు మంటుండగా ఇందిర వెంట నడవసాగాడు బాబా!

ఈ వార్త హరిజనవాడంతా గుప్పున పాకిపోయింది. మన కోటిగాడు కలకటేరీ చదువుతాడంట అంటూ గెంతు వేశారు. మాకాలు అదృష్టమే అదృష్టం అని పొంగిపోయారు.

* * *

నాట్యాలూ, పంటలూ, కోతలుగానూ, వేలాలూ వ్యాపారంగానూ కాలం గడిచిపోతూనే వుంది. మనిషి కాలంతో పాటు పరుగెట్టాలంతే. కాలం మనిషి కోసం ఆగదు. పడినవాడు లేవడానికి వ్యవధి



# ధర్మపథం

## ఏవరిని ఎలా వశం చేసుకోవాలి?

ఇహలోకంలో మన జీవితం సుఖంగా సాగిపోవాలంటే అందరితోనూ వారివారికి తగినట్టు ఉండాలి. అవతలివారి స్వభావంతో నిమిత్తం పెట్టుకోకూడదు. వారిని సరిచేసుకోడానికి ఉపాయం వారిని లోబరచుకొనడమే! వారు మనకు లొంగుతారా? అని సందేహించ నక్కరలేదు. అలా లోబరచుకోనడానికి కొన్ని కిటుకులున్నాయి. వాటిని మన పెద్దలే నిర్ణయించారు. వినండి–

"మిత్రం స్వచ్ఛతయా రిపుం నయబలైః
లుబ్ధం ధనై రీశ్వరం
కార్యేణ, ద్విజమాదరేణ, యువతిం
ప్రేమ్ణా సమై ర్బాంధవాన్,
అత్యుగ్రం స్తుతిభిః గురుం ప్రణతిభిః
మూర్ఖం కథాభి ర్బుధం
విద్యాభి రసికం రసేన, సకలం
శీలేన కుర్యాద్వశమ్."

మన మిత్రుడికి మనపై నిక్కమైన అభిమానం కలగాలంటేకల్లా, కపటం లేకుండా అతనియెడల పరిశుద్ధమైన మనస్సుతో ప్రవర్తించాలి. అలాటప్పుడు అతనివల్ల ఎట్టి సహాయాన్నయినా పొందవచ్చును. కపటంగా ప్రవర్తిస్తే మాత్రం స్నేహం దెబ్బతింటుంది.

శత్రువు మనపైకి దాడి చేశాడంటే నూతనోత్సాహంతో ఉన్న మానవ బలాన్ని ఉపయోగించాలి. అప్పుడు అతడు లొంగిపోక తప్పదు. లోభికి డబ్బు ఇస్తే సరి. కుక్కలాగా తన వెంట తిరిగి చెప్పిన పనులు చేస్తాడు. అతడు మరో రీతిని లొంగుబాటుకు రాడు.

చెప్పిన పని చేస్తే యజమానికి వల్లమాలిన అభిమానం కలుగుతుంది కోరినవన్నీ యిస్తాడు మర్యాద చూపితేచాలు బ్రాహ్మణుడు లొంగిపోతాడు. మరేమీ యివ్వకపోయినా తన్ను ప్రేమించిన యువతిని ప్రేమిస్తే సరి, ఆమె లొంగిపోతుంది. ఇంటికి వచ్చిన బంధువులను తనతో సమానంగా చూస్తే వారు వశమైపోతారు. అహంభావం ప్రకటించకూడదు. మహా కోపంతో ఉన్న వానిని పొగిడితే ఆ కోపం పోయి తనపై అభిమానం కలుగుతుంది. గురువుకు నమస్కరిస్తే– దానితోనే తృప్తి పడతాడు. మూర్ఖుణ్ణి లొంగదీసుకుని మంచి మార్గంలో పెట్టడానికి కథలే మంచి మందు. తన విద్యను ప్రదర్శిస్తే విద్వాంసునికి ఆనందం, అభిమానం కలుగుతాయి. రసవంతమైన కావ్యశ్రవణంవల్ల రసికుడు పరవశుడవుతాడు. ఇవన్నీ ఒక యెత్తు. శీలం ఒక ఎత్తున్నూ. తనకు ఉత్తమ శీలం ఉంటే అందరూ తనకు లొంగిపోతారు. అందరి ఆదరాభిమానాలూ లభిస్తాయి

— *బులుసు వేంకటరమణయ్య*

---

నిస్పృహ. విచిత్రం ఏమిటంటే– కాలం గబగబ నడిస్తే బాగుండు ననుకున్నప్పుడు, హంస నడకలు నడుస్తుంది. అయ్యో కాస్త ఆగితే బాగుండును అన్నప్పుడు రెక్కలు పరచి ఎగిరిపోతుంది.

సంగమేశ్వరరావుగారికి జబ్బుచేసిందని విని ఇందిర వూరుకు వెళ్ళింది– కోటిగాడు పరీక్షలు రాసేసిన సంవత్సరంలో. అప్పుడే సూరమ్మగారు అగ్రహారం వదిలి వచ్చారో పదిరోజులపాటు. "అమ్మడూ! నీలాంటి పిల్లకి అన్యాయం చేశాడో చూడు నీ తమ్ముడు!" అని కూతురికి చెప్పతున్న సంగమేశ్వరంగారి ముఖంలోకి ఆశ్చర్యంగా చూశారు సూరమ్మగారు.

"ఏమిటి నాన్నా నువ్వనేది? ఈ టీచరమ్మ మన గోపీకి తెలుసా? యిన్నేళ్ళున్నాది, ఒక్కమాట చెప్పలేదేం? ఇద్దరూ గర్భశత్రువుల్లాగా వున్నారు" నమ్మలేనట్టు అడిగారు సూరమ్మగారు.

సంగమేశ్వరరావుగారు ఇందిర గురించి చెప్పారు. ఇందిర హింసాకాండలో తాను కాస్త పాలుపంచుకొన్నందుకు సిగ్గుపడుతూ సూరమ్మగారు "మరేం అనుకోకు ఇందిరా! ఏదో చదువు సంధ్యా లేనిదాన్ని. ఏమిటో గొప్ప హోదా అని విర్రవీగడమే తప్పించి

## కోటిగాడు

విలువలు తెలియనిదాన్ని" అన్నారు చాలా నెమ్మదిగా. కోటిగాడిని గురించి ఆవిడగారికి అడగాలని తహతహ కానీ పౌరుషం అడ్డొస్తూంది. "ఏమిటో ఆ నాకాలూ వెంకన్నా కొంపవొదిలేశాక సందడే పోయింది నాన్నా" అన్నారు.

ముసలాయన నవ్వుకున్నారు. "మనిషి విలువ మనిషి దూరమయ్యాకగాని తెలియదమ్మా! మసి పాత్రలో కట్టినంత మాత్రాన మాణిక్యం విలువ కోల్పోతుందా! ఇప్పుడు చూడు కోటిని... జిల్లాకి ఆఫీసరవుతాడు. పుట్టుకలో ఏముందమ్మా, సంస్కారం వుండాలి. మనిషికి విలువగాని, వాడి బట్టలకీ, వాడి యింటికీనా యివ్వడం? ఇన్నేళ్ళకేనా తన కూతురు కాస్త తెలివి తెచ్చుకుంటోందని ఆనందించారాయన.

తండ్రికి నయం అయ్యాక యింటికి వెళ్ళారు సూరమ్మగారు. ఆమెకి తను విన్నదంతా గొప్పగా చెప్పాలని కాని ఆ యింట్లో ఆమె మాటలు సరదాగా వినేవాళ్ళూ, ఆనందించేవారూ లేరు. నీ ముఖం ఏడిచినట్టేవుంది లాంటి మాటలకంటే యింటి ఆడదానితో యింకేం మాటలుంటాయి అనేరకం కరణంగార్కి ఇక కాదు అపును అయినప్పటి నుంచీ వారి రుసరుసలకి అంతులేదు – మరీ కోపం ఎక్కువైపోయింది.

ఇందిర స్కూలంతా వెల్లలు వేయించింది. తోరణాలు కట్టి అలంకరింపచేసింది పిల్లల చేత. ఇంకో పదిరోజులలో గాంధీజయంతి వస్తూంది. అది దాటితే– నెహ్రూ జన్మదినం. రెండూ పిల్లలకి ముఖ్యమైన పండుగలే! పసిపిల్లల హృదయ పరివర్తన కోసం ఇలాంటి పండుగలు విధిగా జరిపించాలని ఇందిర నమ్మకం. ఏటేటా స్కూల్లో కొత్తకొత్త సంప్రదాయాలు ఏర్పరుస్తూ చాలామందిని మంచి పౌరులుగా రూపు దిద్దింది ఇందిర. అందరినీ రూపు దిద్దడం ఒకయెత్తు కోటిగాడిని రూపాంతరం కావించటం ఒకయెత్తు. ఆమె కేనాడో దత్తపుత్రుడై పోయాడు. వాడింత పెద్దవాడై వస్తున్నాడంటే కొండంత ఆశ. తల్లిదండ్రులకంటే వాడిని ముందు చూడాలన్న ఆశ ఇందిరని నిలువనీయడంలేదు చీటికీ మాటికీ స్కూలు ఆపి యివ్వక్కరలేకుండా అగ్రహారానికో కమ్యూనిటీ హాలు వచ్చింది. అప్పుడప్పుడు వచ్చే రాజకీయ వాదుల ఉపన్యాసాలతో అది

దద్దరిల్లిపోతూ వుంటుంది రెండో తరం కుర్రకారులో వడివుండేతనం కాస్త కాస్త వైదొలగిపోవడం, పట్నాలలో కంటే పల్లెలో నే ఎక్కువగా కనబడుతుంది. నిజానికి పల్లె మారనిదే పట్నం మారదు ఆడది మారనిదే సమాజం మారదు. గ్రామ సేవికా హెల్తు విజిటర్‌ను లాంఛనప్రాయం కాకుండా వారికి ధైర్యం నూరిపోసి వూరు కార్యక్రమాలలో తలయూర్చి పనిచేసేలా చేస్తూ పెద్దరికం వహించింది ఇందిర. ఆ రోజు ఇందిరకి కాస్త అలసటగా వుండి పడ కుంది. తలవైపున దీపం పెట్టుకుని పడుకుని పుస్తకం చదువుకుంటుంది. ఆదరా బాదరా పరుగెత్తి వచ్చింది నూకాలు.

"అమ్మగారూ! ఈ దారుణం విన్నారా" అంటూ!

"ఏమైందే ?" అందేగాని నూకాలు ముఖం చూసి చాలా ఘోరమే జరిగింది అనుకుంటూ లేచి కూర్చుంది.

"రా నూకాలూ! రా కూర్చుని చెప్పు. ఏమైందో" అంది.

"ఏం చెప్పనమ్మా! ఇప్పుడే మనిషొచ్చా డంట— నేను నమ్మలేకుండా ఉన్నా నమ్మ గారూ! మన మాలక్ష్మమ్మ మొగుడు చచ్చిపోయిండంట! అంతా ఒకటే ఇదిగా చెప్పుకుంటున్నారు" దుఃఖంతో నూకాలు మాట్లాడలేకపోయింది.

"నిజంగానా ?" నమ్మలేక అడిగింది మళ్ళీ.

"అవునమ్మగోరూ! కారొచ్చింది. కరణం బాబుగారు చినబాబుగారూ అమ్మగా— వెళ్తున్నారంట."

అలాగే కూర్చుండి పోయింది యిందిర. ఎందుకో ఆమె మనస్సులో ఉవ్విళ్ళూరుతూ వస్తున్న కోటిగాడి రూపం మెదిలింది.

ఆ వూళ్ళో ఒక్క ఇందిర మనస్సులోనే కాదు. నూకాలు మనస్సులోనూ బాబా మనస్సులోనూ కూడా కోటిగాడు మెదిలాడు. చిన్నతనం నుంచీ ఎంతో నేస్తాల్లా మెదిలినా యిద్దరూ విభిన్న ధృవాలలో పడిపోయారు. విధి ఒకరిని ప్రేమించింది. ఒకరిని తిప్పి కొట్టింది. విజయగర్వంతో కోటిగాడిని పైకి లేవనెత్తింది. వంచిన తల ఎత్త కుండా మహాలక్ష్మిని ఓ చావుదెబ్బ కొట్టి— నవ్వుకుంటోంది.

"ఎంత దారుణమే పాపం! యీ వయస్సులో కరణంగారి దెబ్బని ఎలా తట్టు కుంటారో ఏమో !" బాధగా అంది.

"లే- వెళ్ళి పల్కరించివద్దాం" అంటూ లేచింది ఇందిర. ఇద్దరూ వెళ్ళి కరణం గారింట్లో అడుగు పెట్టేసరికే, వారు ప్రయాణానికి సిద్ధంగా వున్నారు. కొత్తగా ఏర్పడిన అనుబంధంతో సూరమ్మగారు ఇందిరను కౌగలించుకుంటూ చూశావా అమ్మా! భగవంతుడెంత దారుణం చేశాడో!" అంటూ భోరున ఏడ్చారు. ఏడుస్తూనే వున్నారు.

"ధైర్యంగా వుండడమ్మా! యిలాం టప్పుడే- మనస్సు గట్టిపరుచుకోవాలి." అంటూ కారు దగ్గరకు నడిపించింది దిశలు దద్దరిల్లేలాగ ఆ తల్లి ఏడుస్తుంటే, చూడవచ్చిన వాళ్ళ మనస్సులు ద్రవించి పోయాయి.

మనసు బాగులేక ఇందిర కూడా అలా చెరువుగట్టు మీదకి వెళ్ళి కూర్చుంది. గాలికి చెరువులో కెరటాలు అంచులకి తాకి మళ్ళీ వెనక్కి పోతున్నాయి! గట్టు తెంచుకు ఎటుపోకలరు ? మనిషి మనస్సులోని బాధ అంతే. గుండెల అంచుల తాకి, అక్కడి కక్కడే మళ్ళీ కొట్టుకుంటూ బాధని అధికం చేస్తాయి. ఏవేవో ఆలోచనలతో అలాగే కూర్చుండి పోయింది. చీకటి పడి పోయింది. చంద్రోదయం కూడా అయింది. కాని ఇందిర కదల్లేదు. కదలబుద్ధి కాలేదు. ఎంతో సంతోషంతో పగిలిపోతుందనిపించిన గుండె యిప్పుడెంతో విషాదంతో అతి భారంగా అనిపిస్తూంది.

"బేటీ! ఇక్కడా వున్నావు!" అంటూ అహమ్మద్ బాబా వచ్చి పిలిచేదాకా యీ లోకంలోకి రాలేదు ఇందిర.

"నీకు ఉత్తరం వచ్చిందమ్మా! తీసు కొచ్చాను" అంటూ అందించాడు.

దాన్ని అందుకుని లేచింది ఇందిర. "పద బాబా ఈ చీకట్లో కనబడదు. ఇంటికి పోదాం" అంటూ ముందుకు సాగింది.

చెరువు పాతదే కాని, చుట్టూ మెట్లు కట్టారు. పార్కు పేరిట పెద్ద చెట్లు కొట్టేసి, గుబుర్లు వేశారు. వూరు పిల్లల కోసం దూరంలో ఆటస్థలం ఏర్పరచారు. కానీ ఎక్కడా అలికిడి లేదు - గూళ్ళకు చేరే పక్షులగోల తప్పించి. ప్రశాంతతను చీల్చు కుంటూ "అంబా" అంటూ అప్పుడప్పు డెక్కడో ఓ దూడ అరుస్తుంది. ఎవరూ తల్లి దగ్గిరకి వదల్లేదు కాబోలు—జ్ఞాపకం చేస్తూంది.

ఉత్తరం విప్పి చదివి, అల్మార్లో పెట్టింది ఇందిర

"కోటిగాడేనా బేటీ! దాచేశావేం? ఈ బాబాకి చెప్పకుండా?" అడిగాడు.

"అవును బాబా! వాడివూరు చూడ కుండా ఇంకొక్క రోజుకూడా వుండలేడుట. అంచేత వస్తున్నానని రాశాడు."

"ఇంత సంతోషం పంచుకోందుకు మాలక్ష్మి బేటీ ఉండదనేగా అలా మౌనంగా



ఉన్నాం? జోక్! మానవుడు తన ప్రయత్నాలు తను చేస్తూ వుంటాడు. అల్లా కూడా తన ప్రయత్నాలు తను చేస్తూ వుంటాడు. మనం ఆ సంగతి మరిచిపోకూడదు. మరి వార్త వెంకన్నకి చెప్పనద్దూ!"

"వద్దు—వద్దు. ఒక్కసారి వచ్చి అవమానంతో ముంచవే బాబూ!" అంది ఇందిర.

ఆమె కళ్ళు వర్షించడానికి సిద్ధంగావున్న మేఘాలలాగా వున్నాయి. గడచిపోయిన సంవత్సరాలన్నీ తుడుచుకుపోయి— విన్ననే వెళ్ళిన కోటిగాడిపూట వస్తున్నాడా అనిపించింది ఇందిరకి. చదువు చదువు అని తపనపడిపోయిన కోటిగాడేనా—యీవచ్చేది? లేక రెవిన్యూ ఆఫీసర్ కోటిగాడా?— నవ్వుకుంది.

## 8

అనుకున్నట్టు కోటిగాడు రాలేదు. అధికారికంగానే రావలసిన పని కలగడంతో ముందు రావడం మానుకున్నాడు. రెవిన్యూ శాఖలో తర్ఫీదైన కోటేశుకి ఉన్నతోద్యోగుల దగ్గిర మంచి పేరుంది. అందుకే జిల్లా అధికారికి అనుభవ శాలులు చేయతగిన పని అప్పగించాడు. అది విని, "సార్! నేనా ప్రాంతాల వాడిని" అన్నాడు నెమ్మదిగా.

### మనవి

ఉత్తరాలు రాసేవారు తమ పూర్తి పేరు, చిరునామా పూర్తిగా తెలుగు లిపిలోనే రాయాలి. తెలుగు లిపిలోనే అయినా సరే పేరు, ఊరు మాత్రం రాసి వున్న ఉత్తరాలు ప్రచురణకి పరిశీలించబడవు. (సం.)

# కోటిగాడు

"మాకు తెలుసయ్యా! అందుకే న్యాయం చేస్తావేమో చూద్దామని" నవ్వుతూ కోటి భుజం చరిచాడు — బాగా సీనియర్ అయిన అధికారి.

"మీకు తెలిస్తే నాకీపని అప్పగించరు సార్!" మళ్ళీ హెచ్చరించాడు కోటి.

"అయితే చెప్పు" అంటూ కుర్చీ చూపెట్టారు అధికారి.

కోటి కూర్చుని తన తండ్రి కథ అంతా చెప్పాడు. తనెలా రక్షింపబడిందీ చెప్పాడు. "సర్! దేవతలాంటి టీచరమ్మని చూడాలని తహ తహ లాడుతున్న నన్ను యీ పని కట్టిపడేసింది. నేను నిష్పక్షపాతంగా పని చేయలేకపోవచ్చు. నన్ను క్షమించండి" అని ప్రాధేయపడ్డాడు.

"యంగ్‌మాన్! కాల్చిన యినుమునే సాగకొట్టడం, నగ చేయాలంటే బంగారం కూడా కొలిమిలో కాలి తీరాలి. ఇది నీకో మంచి అవకాశం. ఏ ప్రాంతంలోనూ ఏం జనం వెనకబడే వుండాలని లేదే! నీ వాళ్ళకు చెప్పు—మంచీ చెడూ. అధికారిగా కాదు వాళ్ళ మనిషిగా చెప్పు. ఇక తరువాత పని తరవాతే కద. ధైర్యంగా వెయ్యాలయ్యా! మీలాంటి మెరికల్లాంటి కుర్రాళ్ళు కూడా వెనకాడితే ఎలా?" ధైర్యం చెప్పాడు.

కోటి గుండెలు దడ దడ లాడాయి — బయలుదేరాలంటే. కానీ మరో పక్క సంతోషంగా కూడా వుంది - ఇదే కాబోలు— న్యాయ నిర్ణయం అంటే — అనుకుంటూ జీప్ ఎక్కాడు.

జీప్‌లో గుమాస్తాలు, తన ప్యూను అంతా వున్నారు. అయినా కోటిగాడిమనస్సు ఒంటరిగా ఏవో ఆలోచనలు చేస్తూంది. నా ఊరెలా వుంటుంది. మారిపోయి వుంటుందా! అసలు నన్ను గుర్తు పడుతుందా? అధికార్కి మొక్కినట్టు మొక్కి వూరుకుంటుందా? ఏవేవో యక్ష ప్రశ్నలు లక్షల ప్రశ్నలు ఒకదాన్నొకటి దూసుకుపోతున్నాయి. ఆఫీసర్‌గారు సైలెంటుగా వుండిపోవడంతో జీప్‌లో అంతా కిమ్మనకుండా వూరుకున్నారు.

కారు జిల్లా కేంద్రం చేరింది. అంతా వసతి గృహంలో మకాం చేశారు. ఇంక రెండే రెండు మైళ్ళు— నా వూరు అనుకుంటూ పక్కమీద వడుం వాల్చాడు కోటి. అతగాడి మనస్సు చెరువు చుట్టూ, మహాలక్ష్మి చుట్టూ, పరిభ్రమిస్తోంది. మా లక్ష్మిని చూడకపోతే, తప్పించి— తను పోగొట్టుకున్న దేమిటో అర్థం కాలేదు వాడికి. చదువుకునేటప్పుడు, పరీక్షలు రాసేటప్పుడు "కోటిగా— కోటిగా" అంటూ పిలిచే అమ్మాయిగారు జ్ఞాపకం వస్తే అన్నీ వదిలేసి వూరుకి పారిపోదాం అనిపించేది. హాయిగా చెట్లవెంట, పుట్ట వెంటా అమ్మాయిగారి వెనక తిరుగుతూ, ఆమె ఆజ్ఞలు తు. చా తప్పకుండా పాటిస్తూ తిరగాలనిపించేది. కబుర్లు చెప్పేప్పుడు తిప్పే ఆమె చేతులు- పరుగులు పెట్టేప్పుడు— పాదాలపై జీరాడే పరికిణీ కుచ్చెళ్ళు— మిలమిల మెరిసిపోయే కళ్ళు— కోటిగాడి మనస్సులో చెరగని ముద్ర వేశాయి. అవి మారం అయినప్పుడే— జీవితంలో ఇంకన్నీ వుండీ లేనట్టే" అనుకునేవాడు. అమ్మాయిగారికి పెళ్ళయిందని అమ్మ రాయించినప్పుడు వాడిలో ఏదో తెలియని ఆరాటం బయలుదేరింది. దానికి నిర్వచనం వాడికేతెలియలేదు. అమ్మాయిగారు

లేని అగ్రహారాన్ని వాడు వూహించుకోలేక పోయాడు. ఏమిటో ఆ వూరు వెళ్ళి పడాలన్న తహతహ చచ్చిపోయింది కోపం, తాపం, అంతా చదువు మీదకి తిప్పాడు. జీవితంలో ఏది న్యాయం అనుకున్నాడో, ఏ దీపం టీచరమ్మ వెలిగించి వదిలిందో దాన్ని వూపిరిగ చేసుకోవాలని నిర్ణయించుకుని ఏకాగ్రత పెంచుకున్నాడు. తన మనస్సులో అమ్మాయిగారి మీద ఆరాధన యింత బలంగా వుందని, అమ్మాయిగారి పెళ్ళయ్యాక కాని వాడికి తెలియలేదు.

"యింత దగ్గరలో టీచరమ్మని పెట్టుకుని యిలా వదులుకుని వెళ్ళిపోగలనా?" అనుకుని లేచాడు కోటి. "బాషా" డ్రైవర్ని పిలిచాడు "ఓ పది గంటలదాకా అగ్రహారం పోయివద్దాం" అడిగాడు.

"అదేమిటిసార్! ఇక్కడేవద—నేను చెడి పోవ్" అన్నాడు, కోటిగాడి వయస్సువాడైన డ్రైవర్.

"నీకు తెలుసో లేదో! నా కక్కడో ఎంగా కూడా వున్నాడు అహమ్మద్ బాషా!" నవ్వుతూ జీప్ ఎక్కి కూర్చున్నాడు.

జీప్ గతుకుల రోడ్డుమీద ఎగిరేటంతేప్పి నవ్వొస్తుంది కోటికి— "అగ్రహారం కొంచెం కూడా మారలేదు నేను చిన్నప్పుడు చెరా సినిమా చూడాలంటే, యిక్కడి గాడి పరుగెత్తేవాడిని" అన్నాడా జ్ఞాపకాలు నెమరువేసుకుంటూ. బాషా, బాబుగారి చిన్ననాటి సరదాలకి నవ్వుకున్నాడు.

దూరంలో అగ్రహారం దీపాలు, గుడ్డి దీపాల్లాగా మిణుకు మిణుకు మంటున్నాయి. "ఇవి ఎలక్ట్రిసిటీ దీపాలేనా?" అనుకున్నాడు.

"మీలాంటి వాళ్ళు వూరుకుంటేనా, ఇవన్నీ బాగవ్వుపార్" అన్నాడు.

"ఈ మాత్రం మార్పు వచ్చింది సంతోషించు బాషా! నన్ను యీ పక్కనే ఆపు. నేను నడుచుకుంటూ వస్తాను. మువ్వలా తిన్నగా వెళ్ళి ఎడం వేపు తిరిగి, ఎవరినడిగినా మ్యాలుకి దారి చూపిస్తారు. అక్కడ వుండు. వచ్చేస్తాను" అంటూ బాషా జవాబుకోసం ఎదురు చూడకుండా చెరువుకట్ట పక్కనుంచి మళ్ళిన కాలిబాట వెంట నడవ ప్రారంభించాడు కోటి.

ఆ కాలిబాట చెరువు నీటికి నుంచి పూర్ణోత్సి తీసుకెళుతుంది. అది కోటికి బాగా పరిచయం అయిన కాలిబాట. అలో చనలు, చిన్ననాటి ఎన్నెన్నో సంగతులు ఒక దానివెంట ఒకటి తరుముకు రాగా— కోటి ఆ బాటవెంట చెరువుగట్టు చేరాడు.

చెరువు ప్రశాంతంగా వుంది. అప్పుడే లేస్తున్న చంద్రుని వెలుగులో నీరు వెండి పూత పెట్టినట్టు మెరుస్తూ పాత చెరువే గాని, క్రొత్తగా వుంది. ఇదివరకు లాగా ఒక్క ముందుపక్కనే మెట్లు లేవు— చుట్టూ మెట్లున్నాయి. ఏదీ నా చెట్టు! వెతుకుతూ చూశాడు. మెట్లపక్క బట్టలుతుకు రాళ్ళు చోటు చేసుకున్నాయి దాని స్థానే! అలాగే ఒక రాయిమీద కూర్చుని ప్రశాంతంగా వున్న నీళ్ళకేసి చూస్తూ వుండి పోయాడు. అక్కడ ఎన్నెన్ని దృశ్యాలు చూశాడో చివరికి ఎంతటి గాయం చూశాడు? ఈ సెల్లలాగా మనో చిత్రాలు కళ్ళముందు కదలాడుతున్నాయి. రాతితో కలిసిన రాతి బొమ్మలాగే కూర్చుండి పోయాడు కోటి.

అలా ఎంతసేపు కూర్చున్నాడో అతనికే తెలియదు. ఏదో అలికిడి మెట్లకేసి చూశాడు. ఎవరో నీరు ముంచుకుంటు న్నారు— ఈ సమయంలో— వింతగా చూశాడు. సాధారణముగా యీ సమయంలో చెరువుకి ఆడవాళ్ళెవరూ అంతగా రారు— అంతా డుదు తెలియకుండా వుండయాస్తే వచ్చేస్తారు. చూస్తున్నట్టు గమనించ కుండానే అలా చూస్తున్నాడు కోటి!

నీళ్ళబిందె నడుమున ఆన్చి, తడిపిన చీరకుచ్చెళ్ళు ఓ చేత్తో పట్టుకుంటూ పై మెట్టు దాకా వచ్చేసిందా మనిషి. అప్పుడే ఆమె చూసింది, రాతిమీద ఎవరో కూర్చుని వుండడం. చలనంలేక కూర్చున్న ఆ వ్యక్తి చూస్తున్నట్టా, చూడనట్టా? అర్థంకాలేదు. ఇంకో రెండడుగులు వేసి అలాగే నిలబడి పోయింది మహాలక్ష్మి ఆమె చంకనాని ఉన్న బిందె మెల్లిగా జారి పోయింది.

"అరె" అంటూ ఒక్క అంగలో బిందె అందుకుంటూ పైకి చూశాడు కోటి. షాక్తిన్న వాడిలాగా బిందె కింద పడేశాడు. "అమ్మాయిగారూ! మీరా" అన్నాడేగాని అతగాడి కళ్ళముందు అమ్మాయిగారి చిన్ననాటి బొమ్మలు కదలాడుతున్నాయి.

"అమ్మాయిగారూ! ఏమిటిది? ఏమిటీ దారుణం?" బాధగా అడిగాడు.

మహాలక్ష్మి మాట్లాడలేదు. విరిగి పడ నున్న దుఃఖపు ఆనకట్టను పట్టుకు ప్రాకులాడుతున్నట్టుంగానె మనస్సు.

"అమ్మాయిగారూ! నన్ను మరిచి పోలేదా?" బాధగా అడిగాడు. వాడి కంఠంలో నిక్కడలేని దుఃఖం గూడు కట్టు కుంది.

ముఖం చేతులతో కప్పుకుంది.

"నా పేరు కోటిగాడండమ్మాయిగారూ! మరిచిపోయారు కదూ! ఏదీ! ఒకసారి, ఒకే ఒక్కసారి "కోటిగా" అని పిలవం డమ్మాయిగారూ! మీ కళ్ళకి కనిపించకుండా వెళ్ళిపోతాను. మీరింత బాధపడతారు నన్ను చూసి అని అనుకోలేదమ్మాయిగారూ" ఓ అడుగు వెనక్కివేస్తూ అన్నాడు కోటి!

"కోటిగా" అంటూ చిన్నపిల్లలాగా వాడి గుండెకి తల ఆన్చి భోరున ఏడ్చేసింది



# కొత్తది నల్లది శక్తిగలది సూపర్

అమోఘమైన
టాప్-సీల్-వాడని
శక్తికి రుజువు.

'అందరికన్న
నేనే గొప్ప'!




## కొత్త నిప్పో సూపర్ బ్యాటరీ

## 20% అధిక శక్తి

అయినప్పటికీ, మార్కెట్లో పేరెన్నికగన్న బ్రాండు బ్యాటరీల ధరలోనే దొరుకుతుంది. తీవ్రమైన వాతావరణ పరిస్థితుల్లో గూడా లీక్ కాకుండా, తడి తగిలినా పాడవకుండా వుండేందుకు గాను లోహపు కవచం.

ఎలక్ట్రానిక్ యంత్రంతో, ఫ్యాక్టరీనుంచి బయటకు వచ్చే ముందే పరీక్షింపబడినది. మీ టేప్ రికార్డర్, రికార్డ్ ప్లేయర్, మల్టీ బ్యాండ్ ట్రాన్సిస్టర్ కోసం.




సాంకేతిక నైపుణ్యం, జపాన్ దేశపు నేషనల్ వారిది.
నిర్మాత: ఇండో నేషనల్.

everest/78/INL/25

# ‘అనంత’ వాయులీనమైన ‘కృష్ణులు’

“కింగని మ్రోయ దంతులు బిగించి, శ్రుతుల్సరిసేసి యొక్కనూ అంగుళులందు పైబడి— మోహముల్విలుకు మోహన రాగము నాలపించు ‘లోపుగానే’ ‘ప్రక్కంగల వారికిం జెవులు గన్నులు రెండును జాలనట్లుగా’ ఆ తిరుమలేశుని ఆస్థాన విద్వాంసుని హృదయ వీణాతంత్రి పుటుక్కున తెగిపోయింది ఒక్కసారిగా.”

బ్రహ్మానంద స్థితికి చేర్చి సకల రసజ్ఞ లోకాన్ని ఉర్రూత లూగించే ఆ గానకళా మర్మజ్ఞుని వీణ ఇంక మ్రోగదు ఆ వాణి పలుకదు, మూగవోయింది శాశ్వతంగా.

‘విద్యదా ఖండలు’డైన రాళ్ళపల్లి ‘అనంత సుహృజ్జన హృద్వశాంగారంతుడయిన కృష్ణ’గానశీలుడు’, ‘రాగ భావములు రసయోగాకృతి వహించిన మూర్తి’ ఇంక మనకు లేడు.

సాహితీ సమరాంగణంలో సహస్రమాసాలపైగా వెలుగొందిన ఆళ ‘అక్షర స్ఫూర్తి’ ఇంక లేదు

‘వజ్రాలలోన వలపు’ను పుట్టించిన గాన ‘కళా ప్రపూర్ణు’డు రాహుగ్రస్తుడయాడు. రెండు రోజులు ముందుగానే-ఆ షోడశ కళాప్రపూర్ణుని జాతక పంచాంగంలో గ్రహణం వ్రాసి ఉంటాడు విధి.

ఏమయితేనేం! ఆంధ్ర రసజ్ఞ లోకానికి ‘నిండు జాబిల్లి’ ఇంక లేదు. ఆ బోసి చిరు నవ్వుల పండు వెన్నెల రాదు ఇంక.

‘గానకళా సింధు’ కంఠంలో వినలేని రాగాలు ‘వాయు లీనం’ పై వినిపించాయని సంతసించిన సంగీత ప్రియులకు నిజంగా ఇప్పుడు వాయువిలీనమైన ఆ రాగాలు, అన రాగాలు ఏ శ్రుతులలో ఎవ్వరు ఒలికిస్తారు ఇంక!

‘సంగీత కళారత్న’గా గౌరవించిన తన్ను గుర్తించి సమర్పించిన ‘ఆస్థాన విద్వాంస’ పదవిని గూర్చి గురువర్యులు బిడారు కృష్ణప్పగారికి చెప్పడానికి వెళ్ళాడా!

‘సంగీత కళానిధి’కి తిరుమలేశుడిచ్చిన ఆ పదవి ఈ పృధివిలో కాదేమో! ఆ వైకుంఠ పదవిలోనేమో! తాను తీర్చి దిద్దిన ‘మీరాబాయి’ భక్తికి పరవశుడై



స్వయంగా కనికరాల వరాలనివ్వడానికి తరలి వెళ్ళాడేమో ఈ కృష్ణుడు!

‘ధైర్యలక్ష్మి’ అయిన ‘తార’ను తన కమనీయ కంఠమనే సితారపై విన్యసించడానికో, ‘వేమన’ను గూర్చి ఉపన్యసించడానికో దేవలోకం నుంచి ఆహ్వానం వచ్చిందేమో మన ‘శర్మ’ గారికి!

లేదా- అన్నమాచార్యులు తాను ఈమధ్య వ్రాసిన మరికొన్ని కీర్తనలను వినిపించడానికి పిలిచి ఉంటాడు!

‘నృత్తరత్నావళి’ని స్వభావానుగుణంగా అనువదించినందుకు జాయప, దేవవేశ్యామణుల సమక్షంలో సన్మానం చేయడానికి తలపెట్టాడేమో!

లేదా— ఈ ఆదర్శోపాధ్యాయుణ్ణి డా. పుట్టప్పకు మించిన శిష్యులెవరైనా పైలోకంలో పాఠం చెప్పించుకోడానికి అభ్యర్థించారేమో!

‘ఉన్నన్ని దినాలు గొందఱయిన నొమ్మదింపగా గౌరవంబున జీవింప ననుగ్రహించిన’ ఆ భార్గవికి ‘పంచవింశతి’ని కృతజ్ఞతాపూర్వకంగా వినిపించడానికి ఈ భువినుండి ఆ దివికేగినాడేమో!

‘డిగ్రీలు లేని పాండిత్యంబు వన్నెకురాని యీపాడు కాలానపుట్టి’ ఏదో రకంగా నలుగురితో మంచి అనిపించుకొన్నా, ‘నిండు గవిసిన (డిగ్రీలున్న) పామరులు నిండియున్న పాడుకొంప’లా ఉన్న ఈలోకంలో ఉండటం ఇంక గౌరవం కాదనుకొని ‘కట్ట మంచి’తో ముచ్చటించడానికి పయనమైనాడేమో!

ఏ కారణ మయితేనేం!

విమర్శనాలోక తారా పథంలో మరో నక్షత్రం రాలిపోయింది!

తమస్సులో మునిగిన వేమన్న యోగిని కవిగా పరిచయం చేసిన రవి,

రంగనాధుని రాముణ్ణీ, తిక్కన సీతమ్మనూ మనసారా కొలిచిన పరమ భక్తుడుగా,

‘రాయలనాటి రసికత’ను చవిచూపించిన రసికాగ్రగణ్యుడుగా,

‘నిగమశర్మ అక్క’ సౌశీల్యానికి ఖరీదు గట్టిన ‘షరాబు,

‘నవీన గుణసనాథు’ని గరిమను సరిగా కనుగొన్న గుణగ్రహణ పారీణుడూ ఇంక లేడు! మళ్ళీ తిరిగి రాడు!

ఇంక ‘ఊర్వుజవులకు నాసగొనుచు పొగలెగయుగాని మండదీ ప్రొయ్యనగ్గి!’

నిట్టూర్పులు విడుస్తూ ఊరుకోవలసిందే మనం! ఇంక పొయ్యి మండదు! చల్లారిపోయింది పూర్తిగా!

— శివలెంక ప్రకాశరావు.

## అందం

కోకిల కూస్తే
ప్రకృతికి
అందం...
యవ్వనం పూస్తే
మనిషికి
అందం ..
జాబిల్లి విరిస్తే
నింగికి
అందం...
సిరిమల్లి ముడిస్తే
చినదానికి
అందం ...

కంచరాన